# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిపత్రిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును

**Founder: K. NAGESWARA RAO**

సంపుటము **43**
సంచిక **44**
**18-7-51**

ఖర సంవత్సర ఆషాఢ శుద్ధ పూర్ణిమ బుధవారము


## విషయానుక్రమణిక

## 18 జూలై 1951

# కాంగ్రెసుకు గల సమస్యలు



దేశవ్యాప్త ఎన్నికలు ఇంకా నాలుగు నెలలే ఉన్నాయి స్వాతంత్ర్యం వచ్చిన నాలుగేళ్ల కాలంలో చేసిన పనుల కన్న ఇకముందు కాంగ్రెస్ ఎంతో మహత్తరమైన కార్యాలను సాధించాలని నెహ్రూ ఆశయం బెంగుళూరులో ఆయన తన తొలి ఎన్నిక ప్రసంగంచేస్తూ "దేశాన్నంతటినీ కూడగట్టగల సంస్థ కాంగ్రెసు ఒకటే మిగిలినవన్నీ పదవులకొరకు చేతులు కలుపుతున్న చిల్లర సంస్థలు," అని చెప్పారు

నెహ్రూచేత తయారు చేయబడి, కాంగ్రెసు కార్యవర్గంలో దీర్ఘంగా చర్చించబడి చివరకు ఏ ఐ సి సి లో దాదాపు యథాతథంగానే ఆమోదించబడిన కాంగ్రెసు ప్రణాళిక కాంగ్రెసు సాధించదలచిన ఉన్నతాశయాలను పేర్కొంటున్నది అదేవిధంగా ప్లానింగ్ కమిషన్ వారి నివేదిక కూడా కాంగ్రెసు ప్రణాళికలోని ఆశయాలకు వాస్తవస్వరూపం చేకూర్చే పథకాలను సూచిస్తున్నది నెహ్రూ ప్రకటించే ఆశయాలకు ఇది ప్రత్యక్ష సాక్ష్యం ప్లానింగ్ కమిషన్‌వారి పంచవర్ష ప్రణాళిక అమలుజరిగే లోపల ప్రభుత్వం అందులో కొన్ని సవరణలు చేయవచ్చు; అమలు జరగటంలో కూడా ప్రభుత్వమూ, ప్రజలూ చాలా చిక్కులను ఎదుర్కొనవలసి రావచ్చు ప్రభుత్వానికి ప్రజల సహకారం ఎంతైనా ఉండాలి లేనిచో ఈ పంచవర్ష ప్రణాళిక అమలు జరగటం సాధ్యమే కాదు ఆ సహాయాన్నే నెహ్రూ ప్రజల నుంచి అన్నివిధాలా అర్థిస్తున్నారు

## కాంగ్రెసు ఐక్యత

కాని ప్రస్తుతం కాంగ్రెసే పెద్ద చిక్కులను ఎదుర్కొంటున్నది అందులో ఒకటి కాంగ్రెసు ఐక్యతా సమస్య ఐక్యతకొరకు లోగడ జరిగిన ప్రయత్నాలు ఏమాత్రమూ ఫలించలేదు బెంగుళూరులో ఏ ఐ సి సి సమావేశంలో మాట్లాడుతూ కాంగ్రెసు అధ్యక్షుడు టాండన్ 25 వందలమంది కాంగ్రెసువాదులు కాంగ్రెసు సభ్యత్వాలకు రాజీనామా లిచ్చినట్లు తెలిపారు వీరిలో కాంగ్రెసు సంస్థలలో పదవులలో గల వారి సంఖ్య 50 కూడా లేదు అందుచేత కాంగ్రెసు విచ్ఛిత్తికి కారణం అచ్చుగా పదవుల కొట్లాటలే అనుకోవటానికి కూడా లేదు కాంగ్రెసు ఆశయాలకూ కాంగ్రెసు నాయకులు అవలంబించే ఆదర్శాలకూ కొంత వ్యత్యాసం ఏర్పడటంచేతనే ఇట్టి పరిస్థితి ఏర్పడి ఉండవచ్చు

## కార్యవర్గంలో మార్పులు

కాంగ్రెసు కార్యవర్గంలోనూ, ఎన్నికల బోర్డులోనూ మార్పులు కలగాలని నెహ్రూ పట్టుబట్టటానికి కారణం ఇదే అయి ఉండవచ్చు కాంగ్రెసు ఉన్నతాశయాలు సాధించవలసిన ఈ ఉన్నత సంఘాలలో ఆదర్శవైవిధ్యం ఎంతమాత్రమూ వాంఛనీయంకాదు కాంగ్రెసు అధ్యక్షపీఠాన్ని నెహ్రూ అలంకరించాలని అనేకమంది ప్రకటించే అభిప్రాయం కూడా ఇదే ధోరణిలో ఉన్నది

ఎన్నికల దృష్టిలో చూసినా, భావి భారత భాగ్యోదయం దృష్టిలో చూసినా కాంగ్రెసు భవితవ్యం సమీపంగా కాంగ్రెసుసంస్థలో జరగగల అంతరంగిక మార్పులపై ఆధారపడి ఉండేటట్లు కనిపిస్తుంది ఎందుచేతనంటే కాంగ్రెసు ప్రణాళికలోని మహాశయాల విలువ పూర్తిగా కాంగ్రెసు ఐక్యతపై ఆధారపడి ఉన్నది అట్టి ఐక్యత ఇంతవరకు సాధించబడకపోవటంచేతనే మహావీరత్యాగీ, "ఐక్యత సాధ్యంకానిపక్షాన వచ్చే ఎన్నికలలో కాంగ్రెసు పక్షంతరఫున అభ్యర్థులను నిలబెట్టకపోవటం మంచిది" అనటం జరిగింది ఇది కాంగ్రెసు ఐక్యతయొక్క ప్రాముఖ్యాన్ని మాత్రమే సూచిస్తుందనకోవాలిగాని, కాంగ్రెసు నిజంగానే ఎన్నికలలో తటస్థంగా ఉండేపక్షాన కాంగ్రెసు ప్రణాళికకూ, ప్లానింగ్ కమిషన్ నివేదికకూ స్వస్తి చెప్పినట్టే ఈఐక్యతను నెహ్రూప్రభృతులు ఏవిధంగా తెచ్చేదీ చూడవలసిఉన్నది

## భాషా రాష్ట్రాలు

కాంగ్రెసు భవిష్యత్తు యావత్తూ నెహ్రూ పైనే ఆధారపడి ఉన్నదన్న విశ్వాసాన్ని వివిధప్రాంతాలవారూ వర్గాలవారూ ప్రకటిస్తున్నారు ఇది అపోహ కూడా కాదు అటువంటప్పుడు నెహ్రూ భాషారాష్ట్ర సమస్యనుగురించి నిర్లక్ష్య వైఖరి అవలంబించటం శోచనీయమని



కీ॥ శే॥ నారాయణమూర్తి

ప్రసిద్ధకాంగ్రెసువాది రచయిత, పత్రికాసంపాదకులు అయిన వీరు 11 వ తేదీ రాత్రి మద్రాసులో మరణించారు

చెప్పాలి ఏ ఐ సి సి కి నెహ్రూ తయారుచేసిన నివేదికలో భాషారాష్ట్రాల ప్రస్తావనే లేదు, ప్రణాళికలో కూడా ఇతరుల ప్రోద్బలంమీదనే ప్రవేశపెట్టినట్టు తెలుస్తున్నది

ఈ సందర్భంలో అయ్యదేవర కాళేశ్వరరావుగారి సవరణ ప్రతిపాదనకు సమాధానం చెప్పినప్పుడేగాక ఇంతకు పూర్వం భాషారాష్ట్రాల ప్రస్తావన తెచ్చినప్పుడు కూడా నెహ్రూ, భాషారాష్ట్రాలు కోరేవారిది సంకుచిత మనస్తత్వమనే అపోహను వెల్లడిస్తూ వచ్చారు ఇది కేవలం పొరపాటని చెప్పక తప్పదు నిజం ఆలోచించినట్లయితే, భాషారాష్ట్రాలు కాంగ్రెసు ఆశయాలలో ఒకటని తెలిసికూడా వాటికి అవాంతరాలు కల్పించేవారే స్వార్థమూ, సంకుచితత్వమూ ప్రదర్శిస్తున్నారు భాషారాష్ట్రం ఏర్పడడం గురించి ప్రజాభిప్రాయం తెలుసుకోవడం ఎంతైనా సముచితమే కాని ఆంధ్రరాష్ట్ర వ్యవస్థాపనావశ్యకతనుగురించి ఆంధ్రేతర ప్రజల అభిప్రాయం తెలుసుకొన ప్రయత్నించటమూ మహారాష్ట్రస్థాపన గురించి మహారాష్ట్రేతరుల అభిప్రాయం సేకరించటమూ సరి అయిన విధానం కాదేమో 

# ప్రజాపార్టీ పూర్వాపరాలు

## డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు



"ఎవర్ని చూసేనా నవ్వుతున్నానంటే ఏడవకుండా వుంటానికే—"

—బైరన్

"లాతివాని బలావకాశాలను లఘువుగా అంచనా వేయరాదంటారు, ఉన్నదీ లేనిదీ ఉవ్వెత్తుగా ఊహించటం కూడా ప్రాజ్ఞులు చేయవలసిన పనిగాదు చప్పరించి ఉపేక్షించితే ఆదమరుపున దెబ్బ తినొచ్చు, ఉవ్వెత్తుగా ఊహించితే ఉట్టనే కంగారై మన స్థిమితాన్ని పాడుచేసుకోవచ్చు కాంగ్రెస్ సంస్థలో అధికారపీఠంలో వున్న కాంగ్రెస్ శ్రోత్రియులు ఈ పరమార్థాన్ని గుర్తించి, వెనక నుయ్యీ ముందు గొయ్యీగావున్న ఈ పరిస్థితినుంచి కాంగ్రెస్ సంస్థను అతి చాకచక్యంగా ముందుకు నడుపుకు పోవలసివుంటుంది ఒక వేపు నిరాశానిస్పృహల ఒడ్డోలగమూ, రెండో వైపు ఉద్రేకావేశాల సుడిగుండమూ కనుపించుతున్నది ఈ రెండు ప్రమాదముల మధ్యనుంచీ కాంగ్రెసును ఇప్పుడు సురక్షితంగా ఆవతలికి చేర్చుకోగల నౌకాప్రావీణ్యత కావాలి చరిత్రగతిని అవగతం చేసుకుంటే, భావైక్యతలూ బహుళ బాంధవ్యాలూ వున్నాయని ఉపేక్షించి నిద్రపోవటానికి తగిన సావకాశం కనుపించదు అగ్బరుకు శత్రువుగా జహంగీర్ తయారైనాడు, జహంగీరుకు శత్రువు షాజహాను-షాజహాన్‌కు శత్రువు ఔరంగజీబు - ఇలా తండ్రికి కొడుకే శత్రువుగా తయారైన సంఘటనలే యెన్నో మనకక్కడ కనుపించుతుంటే, తక్కిన ఆయా బాంధవ్యాలను తడువుకున్న ప్రయోజనమేవిటి?

ఈ మాటలన్నీ - మామూలు రోకంటి పాటలే అయినా - ప్రస్తుతం కాంగ్రెస్ వర్గాలలో బయలుదేరిన అభిప్రాయభేదాలను అవగతం చేసుకునే పరిస్థితిలో ఉపేక్షింపతగ్గవి కావు ఈ మిత్రులంతా, జాతీయ సమరంలోనూ, నిర్మాణకార్యక్రమంలోనూ కూడా, పరస్పరం, పరమాప్తులైన సోదరులుగా వర్తించి, దశాబ్దాల తరబడి కార్యదక్షతను ప్రదర్శించారు కాని దురదృష్టవశాత్తూ, యీనాడు, దేశం తన బాధ్యతలను తాను నెత్తిన వేసుకుని నిర్వహించుకోవలసి వచ్చిన యీ తరుణంలో పరస్పరం ఒకరినొకరు అవగాహన చేసుకోలేని దుస్థితిలోకి ఉరుకుతున్నారు 65 సంవత్సరాలు పరాయి ప్రభుత్వాన్ని ప్రతిఘటించగలిగిన కాంగ్రెసు, తీరా తన యిల్లు తాను చక్కదిద్దుకునే అవకాశం చేజిక్కిన ఈనాడు అస్తవ్యస్తతకు వచ్చేసింది

సోషలిస్టుల పంథా యేవిటో మనం తేలికగా తెలుసుకోవచ్చు, కమ్యూనిస్టుల తతంగమూ తెలుసు, హిందూ మహాసభ, ముస్లింలీగు, సిక్కు సంఘాలు వగైరా మత సంస్థల పద్ధతు లేవిటో కూడా సులువుగా అర్థం చేసుకోవచ్చు రాజకీయాలు 'అఆలు' తెలియని వాళ్లకు కూడా యివన్నీ అర్థమవుతాయి కాని అధికార కాంగ్రెస్ వర్గాలకూ ప్రజాపార్టీకీ (పూర్వాశ్రమంలో డెమాక్రాటిక్ పార్టీ) వున్న మతభేదా లేవిటో మాత్రం అవగతం చేసుకోవటం దుర్ఘటం కాంగ్రెసుతో తెగతెంపులు చేసుకుంటున్న ఈ పార్టీకి నాయకత్వం వహిస్తున్నవారు అన్యులు కారు - నిన్న మొన్నగా మీరట్ కాంగ్రెస్ అధ్యక్షపీఠాన వర్తించినవారు ఈ సందర్భంలో, 1946 అక్టోబరు మాసంలో నాకూ గాంధీజీకీ మధ్య జరిగిన ఒక చిన్న సంభాషణను పునశ్చరణ చేసుకుంటే, చాలా విచారం వేస్తుంది 1946 సెప్టెంబరులోనో అక్టోబరులోనో గాంధీజీ ఒకనాడు నన్ను పిలిపించి మద్రాసు ప్రభుత్వంవారి ఖద్దరు ప్రణాళికను నా చేతికిచ్చి దాన్ని పరిశీలించి ఒక నివేదికను తయారుచేసి దాని మీద నా చేవ్రాలుచేసి తనకే యివ్వమన్నారు-నా చేవ్రాలుతో సహా దాన్ని మద్రాసు ప్రభుత్వానికి పంపించాలనే అభిప్రాయంతో ఆరోజంతా కూర్చుని సదమదమై ఆ పని పూర్తిచేశాను ఆ మర్నాడు ఉదయం నన్ను ఆయనతోపాటు వాహ్యాళికి రమ్మనమని ఆజ్ఞ యిచ్చారు ఈ సంఘటన పూనాలో గాంధీజీ విడిదిదిగిన ప్రకృతి వైద్యుల ఆవరణలో జరిగింది

### కృపలానీ ఎన్నిక

వాహ్యాళి ముగించుకుని యెవరి పని మీద వారు వెళ్ళిపోవటానికి ఉద్యుక్తులమై వున్న తరుణంలో "మీతో ఒక్కమాట చెప్పాలని పిలిపించాను" అన్నారు గాంధీజీ "మీరట్ సమావేశం దగ్గరబడుతోంది మనకు ఒక అధ్యక్షుడంటూ కావాలిగదా!" అన్నారు నేను వెంటనే అన్నాను 'జవహర్‌లాల్ గారిని జూన్‌లోనే యెన్నుకున్నాంగదా—తదనంతరం సెప్టెంబరులో ప్రధాన మంత్రి పదవిని స్వీకరించవలసి వచ్చిందనుకోండి—అయినా రెండు వ్యవహారాలూ నిర్వహించటానికి ఆయనకు అభ్యంతరం ఉండదనుకుంటాను' 'అలా వీల్లేదు—రెండు స్థానాలలోనూ ఆయనే వ్యవహరించటం నాకు యిష్టం లేదు' అన్నారు గాంధీజీ 'పోనీ మౌలానా?—మరొకతూరి ఆయనే చూస్తారు'—'అదీ యిష్టంలేదు' అన్నారు—'నా మనస్సులో ఇద్దరి పేర్లున్నయ్—కృపలానీ పేరూ, మీ పేరూ—ఈ రెండు పేర్లలో మొదటిదే బాగుంటుందనుకుంటున్నాను "సరే యింకేం బాగానే వుంది!—నేనెన్నడూ ఇలాంటి పదవులకోసం ప్రాకులాడే వాణ్ణి కాదు—తమకు తెలుసుగదా' అన్నాను తెలుసు—ఆ సంగతి నాకు తెలియదా? అన్నారు చిరునవ్వు నవ్వుతూ ఇలా ఈ సంభాషణముగియడం కృపలానీ కాంగ్రెస్ అధ్యక్షులు కావడం జరిగింది అధ్యక్షులుగా ఆయన పలువురి మన్ననలకు పాత్రులైనారు ఈ విషయాన్ని కాంగ్రెస్ చరిత్ర ద్వితీయ భాగంలో నేను సూచించే వున్నాను

అట్లాంటి కృపలానీ డెమాక్రాటిక్ పార్టీ అంటూ ఒకదాన్ని అసలు యెందుకు లేవదీయవలసి వచ్చింది మళ్ళా దాన్ని రద్దుచేసి కాంగ్రెస్ నుంచి యెందుకు వైదొలగవలసి వచ్చింది? ఆయన అభిప్రాయా లేవిటో, యిటీవల పత్రికల్లో ప్రచురించబడిన ఆయన ఉత్తరాలను చదివితే మనకు స్పష్టంగా తెలుస్తూనే వున్నయ్ జాతీయచరిత్రలో ఒక క్రొత్త అధ్యాయానికి నాందిగా ఈ సంఘటన

తయారుకావటానికి, దోహదంచేసిన కారణాలు అనేకం వున్నయ్

ఒకొక్కప్పుడు మానవదేహంలో వున్న యే జీవకణాన్నో ఆశ్రయించుకుని ఒక అదనపు చిల్ల బయలుదేరవచ్చు అలా బయలుదేరిన దానికి రెండే పరిణామాలు. అది దేహాన్ని యావత్తూ క్రమింగి పారెయ్యనూ వచ్చు లేదా ప్రత్యేకం యే అదనపు కండరంగానో కదుముగానో తయారుకావచ్చు ఏదో అదనపు కండరంగా పెరిగిన అంతంత మాత్రపు మొలకైతే తేలికగా శస్త్రం చెయ్యవచ్చు అలా లేకుండా, అది గడ్డు వ్యవహారమే అయితే, దేహం సర్వత్రా అలాంటి కణుతులు బయలుదేరవచ్చు ఈ రోగనిదాన వ్యవహారంలో ప్రస్తుతం మనం యీ స్థితిలో వున్నాం అందుచేత ఈ తరుణంలో ఈ వ్యాధికి మనం యే పేరుపెట్టినా అది దాన్ని ఊహామాత్రమైనదాన్నిగా పరిగణించాలిసిందే గాని ఖండితమైన వ్యాధి నిరూపణగా అంగీకరించటానికి వీల్లేదు రోగపరిణామం యిలావుంటుందని జోస్యం చెప్పటం దుర్ఘటమైన కార్యం అలానే రాజకీయాల పరిణామాలను గురించి జోస్యం చెప్పటంకూడా కష్టసాధ్యం జోస్యం చెప్పటానికేం యేదో వొకటి మీన మేషాలు లెక్కట్టి చెప్పెయ్యొచ్చు కాని ఆజోస్యాలు అదే ప్రకారం అనుకున్నట్టు జరుగుతాయనుకోవటానికి మాత్రం ఎలాంటి సావకాశాలూ లేవు ఈ కొత్త సెల యేరూపంగా పరిణమించుతుందో ముందుగా నిరూపించాలంటే, దానిలో వుండే వివిధ కరణాల స్వరూప స్వభావాలేవిటో పరీక్షించి చూడాలి భూతద్దం పెట్టి గమనించవచ్చు యింకా అవసరమైతే, రసాయనికాదిక పరిశీలన కూడా చేసి చూడవచ్చు ఒక సాహిత్యకారుడు అన్నట్టు కుర్రవాడు పెద్దవాడయ్యాడంటే ఆసంగతి తల్లిదండ్రులకు మూడు సంవత్సరాల అనంతరంగాని తెలీదు కాని ఆ కుర్రవాడు మాత్రం తనకింకా యే రెండు సంవత్సరాలకోగాని యవ్వనం రాకపూర్వమే పెద్దవాణ్ణయ్యాననుకుంటాడు ' ఇలా తరుచు జరుగుతూ వుంటుంది అందుచేత ఈప్రజాపార్టీని పసికాయకింద ఉపేక్షించటానికి సావకాశం వుంది మళ్లా అటు ఓ పెద్ద బ్రహ్మాండమైన వ్యక్తిత్వంగల దాన్నిగా ఉత్ప్రేక్షించటానికీ అవకాశంవుంది మనకు కచ్చితమైన అంచనా తేలాలంటే - ఈ పార్టీ అసలు యెప్పుడు ఎలా పొటమరించింది ? ఈ అంకురం మొలకెత్తటానికి కారణభూతమైన విత్తనంయొక్క సత్తా యెలాంటిది ?- ఈ విషయాలు మనం అర్థం చేసుకోవాలి

వ్యక్తిత్వాలకూ రాజకీయాలకూ స్వరూప స్వభావాలలో తేడా యేమీ వుండదు వీటికి అవినాభావం వుంటుంది 1923 - 26 సంవత్సరాల మధ్య స్వరాజ్య పార్టీ యేర్పడినప్పుడు, నిర్మాణ కార్యక్రమంలో యెక్కువ విశ్వాసం కలవారు, దాల్లో భారవతీసుకుని పనిచేసేవారూ యావన్మందీ ఆ ఉద్యమాన్ని ప్రతిఘటించారు శాసన సభలపట్లా మంత్రి పదవుల పట్లా వారికి చాలా విముఖత వుండేది 1937లో కాంగ్రెస్ మంత్రివర్గాలు యేర్పడినప్పుడు యీ విషయం స్పష్టంగా తేలిపోయింది ఆనాడు కృపలానీ సంయుక్త రాష్ట్రాల మంత్రివర్గంలో విద్యామంత్రిగా యేర్పాటు కావటానికి ఎంతో సావకాశం వుంది అలాంటిదాన్ని చేపట్టవుంటే, పరిపాలనలో ఆయన ప్రభావం తప్పక కనుపించి తీరేది కాని ఆ నాటికి గాంధీజీ యింకా సజీవులై వున్నారు ఆ రోజుల్లో ఆయన ఆశీస్సులేకుండా యే కాంగ్రెస్ శ్రోత్రియుడూ శాసనసభల్లోకి వెళ్లటానికి అంగీకరించేవాడు కాదు సరేకదా, పెళ్ళి చేసుకోవటానికి కూడా అంగీకరించే వాడు కాదు అంతగా యేదేనా తెగించి పెళ్ళి చేసుకున్నా శాసన సభల జోక్యానికి మాత్రం వెళ్లేవారుకారు 1939 త్రిపురా కాంగ్రెస్ అధ్యక్షపదవి పోటీలో సుభాష్ బాబుకు ప్రత్యర్థిగా తన్ను నిల్చోబెట్టలేదని కృపలానికి నొప్పికలిగితే కలిగివుండవచ్చు అలాంటిది సహజం—మహాత్ముని ప్రధాన శిష్యుడుగా, నిజానికి ఆ సందర్భంలో ఆయన ప్రస్తావన రావలసిందే—కాని అలా జరగలేదు ఈ విషయాన్ని అవగతం చేసుకుంటే మీరట్ కాంగ్రెస్‌కు ఆయన అధ్యక్షుడు కావటం హఠాత్ సంఘటనగా అనుకోవటానికి వీల్లేదు

## పరిణామదశ

ఆయన అధ్యక్ష పదవిలో వున్న తరుణం చాలా క్లిష్టమైన పరిణామదశ అధ్యక్ష పదవి ఆనాటికి యెత్తుకోటానికీ దించటానికీ కూడా యీగుగాని దశలో వుంది పూర్వంలాగా, గాంధీ తెరవెనక సూత్రధారిగా నామ్కేవాస్తే పరిస్థితిగానూ లేదు సర్వాధికారాలతోనూ స్వతంత్రంగా వ్యవహరించే వ్యక్తిత్వానికీ పెరగలేదు రామఘర్ కాంగ్రెస్ తదాదీ మౌలానా ఆజాద్ కాంగ్రెస్ అధ్యక్షులుగా వుంటున్నా, 1946 ఆగస్టులో, కాంగ్రెస్ అధికారాన్ని చేపట్టవలసివచ్చినప్పుడు, కేంద్ర మంత్రివర్గాన్ని నిర్మించవలసిందిగా లార్డ్ వేవల్ జవహర్‌లాల్ నెహ్రూను ఆహ్వానించారు గాంధీజీకి రాజకీయ వారసుడుగానూ, అనంతరం సహజంగా దేశాన్ని నడపవలసిన అగ్రనాయకుడుగానూ, ప్రజలూ మహాత్ముడు కూడ అంగీకరించి వున్న విషయం కావటంచేత యిందుకు యెవరూ కాదనలేదు కాని కాబినెట్ మిషన్ భారతదేశంలోవున్న చివరి రోజుల్లో అతఃపూర్వం సర్వదా మౌనంగా వుండే సర్దార్ పటేలు, నోరుచేసుకుని, గాంధీజీని ప్రత్యక్షంగా ప్రతిఘటించటానికి పూనుకోవటంతో గాంధీజీ పలుకుబడికూడా అస్తవ్యస్తం కావటం ప్రారంభమైంది నిర్మొగమాటంగానూ, కంటకంగానూ ప్రతిఘటించిన సంఘటనలు కూడా వున్నయ్ మీరట్ కాంగ్రెస్ నిజానికి చాలా ఉజ్వలంగానే జరిగింది కాని, తీరా నవంబరు 29 వ తేదీ (1946) జవహర్‌లాల్ నెహ్రూ బ్రిటిష్ కాబినెట్ మిషన్‌వారి ఆహ్వానాన్ని అంగీకరించి ఇంగ్లండుకు ప్రయాణం కట్టడానికి సిద్ధం కావటమూ, ఆ కథాక్రమంలో, కాంగ్రెస్ అధ్యక్షుడైవుండి కూడా కృపలానీ యేవిధమైన జోక్యమూ కల్పించుకోకపోవటమూ, కొంత అసంగత వ్యవహారంగా పరిణమించింది 1946 6 వ డిశంబరు ప్రకటన వరమార్థం దేశ విభజనా పథకమే ననే సంగతి యీ నాడు మనకందరికీ తేటతెల్లంగా తెలిసే పోయింది ఆ ప్రకటనను, నెహ్రూ, బలదేవ్ సింగ్, ముస్లిం ప్రముఖులతో సంఘటించబడిన భారత ప్రతినిధివర్గానికి చదివి వినిపించటమూ, విన్న మరుక్షణంలోనే నెహ్రూ, అత్యంత మౌనంగా, ఎకాఎకి విమానకేంద్రానికి వచ్చేసి లండన్ నుంచి బయలుదేరటమూ గమనించితే, అనంతర కథా విధానం ఎలా నడుస్తుందో అందరికి తెలిసేపోయింది

అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గం జనవరి 6 వ తేదీన సమావేశమైంది రాజ్యాంగ నిర్మాణసభలో కూటములపద్ధతిని యెప్పుడు అంగీకరించవలసి వచ్చిందో దాంతో - వనక నుయ్యా ముందు గొయ్యా యెటూ తెగక సందిగ్ధావస్థలో తన్నుకులాడింది సెప్టెంబర్ 9 వ తేదీ (1946) రేడియో ప్రసంగంలో నెహ్రూ ఆ ప్రతిపాదనలోని సూత్రాలను - కూటముల వోటింగు పద్ధతి సహా, అంగీకరించారనే

(44-వ పేజీ చూడండి)

# డైరీ

## ఆదివారం, జూలై 8

—మంగళవారంనాడు ఆరంభం కానున్న కొరియా యుద్ధవిరమణ చర్చలలో పాల్గొనే ఉభయపక్ష ప్రతినిధివర్గాల పేర్లు ప్రకటించబడినవి. ఐక్యరాజ్య ప్రతినిధివర్గ నాయకుడుగా వైస్ అడ్మిరల్ చార్లెస్ టర్నర్ జాయ్ నియమితుడైనాడు

—లండనులో నేటినుండి రాయిటర్ వార్తా సంస్థవారి శతవార్షికోత్సవం ఆరంభమయింది

—అంతర్జాతీయ న్యాయస్థానాన్ని పరిగణించడం మానడానికి ఆలోచిస్తున్నామని పర్షియా పార్లమెంటులో ప్రధాని అన్నాడు

—రష్యాలో జరిగిన విమానదిన ప్రదర్శనలలో అనేక కొత్తరకాల విమానాలు పాల్గొన్నవి

—కాశ్మీరుకు ఐక్యరాజ్య ప్రతినిధి అయిన డా. ఫ్రాంక్ గ్రాహం ఢిల్లీనుంచి శ్రీనగరు వెళ్లి కాశ్మీరు ప్రధాని షేక్ అబ్దుల్లాతో ప్రసంగించాడు

—1949 జనవరి 1 లగాయతు పాకిస్తాను 529 సార్లు యుద్ధవిరమణ ఒడంబడికను ఉల్లంఘించినట్లు భారత రక్షణశాఖాధికారి ఒకరు ప్రకటించారు

—ఏ ఐ సి సి సమావేశానికి గాను వచ్చిన భారతప్రధాని నెహ్రూను బెంగుళూరు విమానకేంద్రంవద్ద పురప్రముఖులు సన్మానించారు

## సోమవారం, జూలై 9

—పర్షియా నూనె తగాదావిషయంలో అంతర్జాతీయ న్యాయస్థానంవారి నిర్ణయాలు అక్రమం గనుక వాటని పాటంచమనీ, బ్రిటను తమ ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలిగించుకొంటున్నందుకు ఫిర్యాదు చేస్తామనీ పర్షియా ఐక్యరాజ్యసమితిని హెచ్చరించింది

—బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికా, మరి 44 దేశాలూ జర్మనీతో తమకుగల యుద్ధసంబంధాలను ఉపసంహరించుకొన్నవి

—జూలై 12 న హర్తాళ్ జరపవద్దని అఖిలభారత పత్రికాసంపాదక మహాసభాధ్యక్షుడు పత్రికలను హెచ్చరించాడు

## మంగళవారం, జూలై 10

—1,793 కోట్ల రూపాయల నిర్మాణ ఖర్చుతో కూడిన పంచవర్ష ప్రణాళికను ప్రతిపాదిస్తూ ప్లానింగ్ కమిషన్‌వారు నివేదిక ప్రకటంచారు

—టాండన్ అధ్యక్షతకింద బెంగుళూరులో కాంగ్రెసు వర్కింగు కమిటీ త్రిదిన సమావేశం ఆరంభమయినది. నెహ్రూ నివేదికా, ప్లానింగ్ కమిషన్ నివేదికా చర్చించబడినవి

—కేసాంగ్‌లో కొరియా యుద్ధవిరమణ సంప్రతింపులు ఆరంభమయినవి

## బుధవారం, జూలై 11

—జీవితావసరాలకు సంబంధించిన సమ్మెలను అక్రమంగా ప్రకటించుటకు ప్రభుత్వానికి అధికారాలిస్తూ అధ్యక్షుడు ఆర్డినెన్సు జారీ చేశాడు. రైల్వే ఫెడరేషన్‌వారు సాగించనున్న సమ్మెను ప్రతిఘటించుటకు ఈ ఆర్డినెన్సు ఉద్దేశించబడింది

కేంద్రరవాణాశాఖామంత్రి రేడియో ద్వారా ప్రసంగిస్తూ, అనేకప్రాంతాల జనం తిండికి మాడే తరుణంలో రైల్వే సమ్మె సాగించటం మూర్ఖకార్య మవుతుందన్నాడు

ప్రభుత్వం రైల్వే సమ్మెను ఆర్డినెన్సు ద్వారా నిషేధించనంతవరకు రైల్వే ఫెడరేషనువారు క్రమబద్ధంగానూ, శాంతియుతంగాను పరిష్కరించే విధానాలకు అవలంబించగలరని ఫెడరేషన్ కార్యదర్శి తెలిపాడు

రైల్వేకార్మికుల కరువుభత్యం విషయంలోగాని, పాతతగాయిదాల పరిష్కారం విషయంలోగాని రాజీపడేది లేదని రైల్వే ఫెడరేషన్‌తరఫున జయప్రకాశనారాయణ తెలిపాడు

—కాంగ్రెసు వర్కింగు కమిటీవారు, నెహ్రూ తయారుచేసిన కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికపై చర్చించారు

—కాంగ్రెసు ఐక్యత సాధించడానికి గాను కాంగ్రెసు మహాసభ ఏర్పాటు కావాలనీ, నెహ్రూ కాంగ్రెసు అధ్యక్షత వహించాలనీ సూచిస్తూ 20 మంది పార్లమెంటు సభ్యులు ఏ ఐ సి సి కి లేఖ వ్రాశారు

—కొరియా యుద్ధవిరమణ సంప్రతింపులలో, కమ్యూనిస్టు ప్రతినిధివర్గ నాయకుడు జనరల్ నామ్ ఇల్ పరిష్కారానికి ప్రాతిపదికగా, యుద్ధం నిలుపు కావాలని ఉభయపక్ష సైన్యాలూ నియమితకాలంలో 38 వ అక్షాంశరేఖను విడిచి 6 మైళ్లు వెళ్లాలనీ, అనంతరం విదేశసైన్యాలు సాధ్యమైనంతత్వరలో ఉపసంహరించబడాలనీ ప్రతిపాదించినట్లు పెకింగ్ రేడియో తెలిపింది

—పర్షియా నూనె తగాదాను పరిష్కరించడానికి గాను తన స్వంత సలహాదారైన అవరెల్ హారీమన్‌ను పంపగలనని ట్రూమన్ చేసి ఉండిన సూచనను టెహరాన్ ప్రభుత్వం ఆమోదించింది

—కాశ్మీరు రాజ్యాంగపరిషత్తు ఎన్నికలకు గాను ఏర్పాటు కావలసిన స్థానాలను గురించి సూచనలు చేయడానికై కాశ్మీరుప్రభుత్వం అయిదుగురు సభ్యులతో కూడిన సంఘాన్ని నియమించింది

## గురువారం, జూలై 12

—కాంగ్రెసు వర్కింగు కమిటీలో ఎన్నికల ముసాయిదా, 20 గంటల చర్చ జరిగిన పిమ్మట, ఆమోదించబడింది

—కొరియా యుద్ధవిరమణ చర్చలు వినడానికి వచ్చే విలేఖరులకు కమ్యూనిస్టులు అభ్యంతరం చెప్పడంవల్ల చర్చలకు అవాంతరం కలిగింది. దీనిపై ఐక్యరాజ్యసమితి అసమ్మతి తెలుపగా, యుద్ధవిరమణకు నిరోధం కలిగించాలని అమెరికన్ ప్రతినిధులు యత్నిస్తున్నట్లు పీకింగ్ రేడియో ఆరోపించింది

—జపానుకు సంపూర్ణ స్వాతంత్ర్యం ఇస్తూ అమెరికా బ్రిటనులు సంయుక్తంగా తయారుచేసిన జపాను సంధి ముసాయిదా ఒడంబడిక ప్రకటించబడింది

దీనినిగురించి బ్రిటిష్ పార్లమెంటులో మాట్లాడుతూ బ్రిటిష్ విదేశాంగ శాఖామంత్రి మోరిజన్, ఈ ముసాయిదాల ఏ చైనా ప్రభుత్వానికి పంపాలన్న విషయం ఇంకా ఏకాభిప్రాయం కుదరలేదన్నాడు

ఈ ముసాయిదా విమర్శనార్థం ఆస్ట్రేలియా, కెనడా, ఫ్రాన్స్, ఇండియా, ఇండొనీషియా, నెదర్లాండ్స్, న్యూజిలాండ్, పాకిస్తాన్, ఫిలిప్పీన్స్, సోవియట్ రష్యాలకు పంపబడింది

(46-వ పేజీ చూడండి)

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

అలెగ్జాండర్ డ్యూమా

## 44

"నా కథ ఎక్కడ మొదలుపెట్టమంటారు ?" అన్నాడు బర్టుక్సియో

"నాకేలా తెలుస్తుంది ?" అన్నాడు మాంట్ క్రిస్టో

"1815 లో ప్రారంభమౌతుంది"

"ఓ ! 1815 అంటే నిన్న కాదు"

"నిన్న కాదు అయినా అప్పుడు జరిగినదంతా నిన్ననే జరిగినట్లుంటుంది నాకొక అన్న ఉండేవాడు అతను కార్సికన్ సైన్యంలో లెఫ్టినెంట్ చిన్నతనంలోనే మాకు తలితండ్రులు పోయారు అంటే అది నా అయిదోయేట మా అన్నకి పద్దెనిమిదేళ్లుండేవి నన్ను తన స్వంత కొడుకులాగా పెంచాడు 1814 లో అతను పెళ్ళిచేసుకున్నాడు ఎల్బాద్వీపంనించి నెపోలియన్ చక్రవర్తి తిరిగివచ్చినప్పుడు మా అన్న సైన్యంలో చేరాడు వాటర్లూ యుద్ధంలో గాయపడ్డాడు తరవాత సైనికోద్యోగంనుంచి విరమించుకున్నాడు అప్పుడు మా వొదినా నేనూ ఒక చిన్న గ్రామంలో ఉండేవాళ్లం ఒకనాడు అతనివద్దనుంచి మాకొక ఉత్తరం వచ్చింది ఇంటికి తిరిగి వస్తున్నాడు నైమ్స్‌లో ఒక హోటల్ యజమానికి ఇవ్వగలిగినంత డబ్బు తన కోసమని ఒప్పగించమని వ్రాశాడు మాదగ్గర వెయ్యి ప్రాంకులున్నాయి అందులో అయిదు వందలు మా వొదినచేతికిచ్చి మిగతా అయిగువందలూ తీసుకుని నైమ్స్ వెళ్లాను

"సరిగ్గా ఈరోజుల్లోనే దక్షిణఫ్రాన్స్‌లో ఘోరహత్యలు జరుగుతున్నాయి నెపోలియన్ పక్షానికి చెందినవారని అనుమానిస్తే చాలు నరికేస్తున్నారు నేను నైమ్స్‌నగరం చేరేసరికి అప్పుడే నగరమంతా కల్లోలంగా ఉంది రాజరికపక్షం నియోగించిన దుండగులచేతుల్లో పడి అనేకమంది హత్యపాలైనారు నగరమంతా నెత్తురు ఏరులై పారిందనాలి నాకు మా అన్ననిగురించి భయం కలిగింది అతను నెపోలియన్ సైన్యంలో పనిచేశాడు సిపాయిల దుస్తులు ధరించిఉంటాడు ఈ దుండగుల కళ్లపడకుండా ఉండడు త్వరత్వరగా హోటల్‌కి వెళ్లాను నా భయం ఊరికే పోలేదు అంతకుముందు సాయంకాలమే నైమ్స్ నగరం చేరాడట ఆ హోటల్ గుమ్మందగ్గరే హత్యచెయ్యబడ్డాడు హంతకులెవరో తెలుసుకోడానికి విశ్వప్రయత్నం చేశారు కాని చెప్పే ధైర్యం ఎవరికీ లేదు దుండగులంటే అందరికీ ప్రాణభీతి ఫ్రెంచిన్యాయస్థానాల కఠిననియమబద్ధ వ్యవహారం నాకు గుర్తుకి వచ్చింది ఫ్రెంచి న్యాయమూర్తులు ఎవ్వరికీ జంకరు న్యాయపాలనలో అతికఠినంగా శాసిస్తారు ఆ ఆశతో నైమ్స్ న్యాయాధికారివద్దకు వెళ్లాను"

"ఈ న్యాయాధికారేనా విల్‌ఫర్ట్ ?" అని అడిగాడు మాంట్ క్రిస్టో, కొంత నిర్లక్ష్యభావం నటిస్తో

"అవునండి ఆయన అప్పుడే మార్సేల్స్‌నించి వచ్చాడు ఆయన న్యాయనిష్ఠ చూసి ఉన్నతపదవి ఇచ్చారట నెపోలియన్ ఎల్బానించి వస్తున్నట్లు మొట్టమొదటగా ఆయనే వెళ్ళి మహారాజుకు తెలియపరిచాడట ఆయనవద్దకు వెళ్ళిచెప్పాను 'నా అన్నను నిన్ననే నైమ్స్‌లో వీధిలో పట్టపగలు హత్యచేశారు హంతకులెవరో నాకు తెలియదు ఎవరో తెలుసుకోవడం మీ కర్తవ్యం హత్యచేసినవారెవరో తెలుసుకుని శిక్ష విధించండి' అన్నాను

'మీ అన్న ఎవరు ?' అన్నాడు విల్‌ఫర్ట్

'కార్సికన్ సైన్యంలో లెఫ్టినెంట్,' అని చెప్పాను

'అయితే నెపోలియన్‌పక్షాన పోరాడినవాడన్నమాట' అన్నాడు

'ఫ్రెంచి సైన్యానికి చెందినవాడు' అని నేనన్నాను

'నీ అన్న అక్రమంగా కత్తిదూసి యుద్ధంలోకి దిగాడు చివరికి కత్తివాత పడ్డాడు'

'అది పొరపాటండి' అని నేనన్నాను 'వనకపాటునవచ్చి అతన్ని హత్యచేశారు'

'నన్నేం చెయ్యమంటావు ?'

'చెప్పాను కదా ! న్యాయశాసనం పగతీర్చుకోవాలి'

'ఎవరి పైన ?'

'హంతకులపైన'

'లేదు నీ అన్న ఎవరితోనో కయ్యానికి కాలుదువ్వాడు కలహంలో మరణించాడు సిపాయిలైనవాళ్లు అనవసరంగా కయ్యాలలో జోక్యం చేసుకోడం ఇక్కడ ప్రజలకి గిటదు'

'అయ్యా ! నేను నాకోసం మిమ్మల్ని ప్రార్థించడం లేదండి నాకోసమైతే విచారించి ఊరుకునేవాడిని లేదా పగతీర్చుకునేవాడిని కాని నా అన్నకి భార్య ఉంది ఆమెకి పరిహారం ఇప్పించాలి'

'ప్రతి విప్లవంలోనూ ఇటువంటివి సంభవించక మానవు నీ అన్న కూడా మిగతావారితోపాటు ఈ విప్లవానికి బలైనాడు అది అతని దురదృష్టం ప్రభుత్వం అతనికేమీ ఋణపడలేదు"

'ఇదేమిటి ? న్యాయాధికారులే ఇలా మాట్లాడుతున్నారు ?'

'హు ! కార్సికన్ దేశస్థులికి వెర్రెక్కువ ఇంకా వాళ్ళ దేశస్థుడే (నెపోలియన్) చక్రవర్తిగా దేశం పరిపాలిస్తున్నాడనుకుంటారు ! నడవతలకి వెంటనే పో లేకపోతే గెంటిస్తాను'

"విల్‌ఫర్ట్ ముఖంవంక చూశాను ఇంకా బ్రతిమాలితే ఆశేమైనా ఉంటుందేమోనని చూశాను కాని విల్‌ఫర్ట్ రాయికంటె కఠినుడు దగ్గరగా వెళ్లి మెల్లిగా చెప్పాను 'కార్సికన్ల సంగతి మీకు చక్కగా తెలుసు వాళ్లెన్నడూ అన్నమాట నిలుపుకుని తీరుతారు నా అన్నని చంపడం మంచిదేననుకున్నారు కాదూ ? మీరు మహారాజుపక్షం కాబట్టేకదా అలా అనుకున్నారు ? ఇదిగో నా మాట

అనువాదం సీతారామ్

వినండి నేను నెపోలియన్ పక్షానికి చెందినవాణ్ణి మీ ప్రాణాలు తీయకపోతే నేను కార్సికన్ దేశస్థుణ్ణి కాదు ఈ క్షణంనించీ మీరు జాగ్రత్తగా ఉండండి ఈ మారు మనిద్దరం కలుసుకున్నప్పుడు మీ అవసానం సమీపించిందన్నమాట మరిచిపోకండి' విల్‌ఫర్ట్ నిశ్చేష్టుడై నావంక చూస్తూ ఉండిపోయాగు నేను ఆ అదనులోనే వెళ్లిపోయాను

"అదిమొదలు విల్‌ఫర్ట్ నలుగుర్ని వెంటబెట్టుకోకుండా ఇల్లు వదిలేవాడు కాదు నాకోసం నగరమంతా గాలించాడు కాని నేను దొరక్కపోయేసరికి మరింత బెదిరిపోయాడు ఇంక నైమ్స్ నగరంలో ఉండడం క్షేమం కాదనుకున్నాడు" పారిస్‌లో అతనికి పరపతిఉంది అక్కడ అధికారుల్ని ప్రార్థించి వెర్సేల్స్‌కి బదిలీ చేయించుకున్నాడు కాని కార్సికన్ దేశస్థుడు పగదీర్చుకోడానికి దూరాలు లక్ష్యపెట్టడు అతన్ని మామూలుగా చంపడం నాకు ముఖ్యం కాదు అలా చంపాలనుకుంటే అనేక వందల సార్లు వీలు చిక్కింది కాని చంపిన తరువాత పట్టుబడకూడదని నా ఉద్దేశం మూడుమాసాలు విల్‌ఫర్ట్ జాడ కనిపెట్టాను అతను అప్పుడప్పుడు చాటుగా ఆట్వ్యల్ గ్రామానికి రావడం కనిపెట్టాను ఈ గ్రామానికి అతన్ని అనుసరించాను అతను సరిగ్గా ఈ యింట్లోకి రావడం చూశాను రహస్యంగా రాత్రివేళ, అదుగో ఆ వెనక తోట గుమ్మంలోనుంచి వచ్చేవాడు గుర్రంపైనో, బగ్గీలోనో ఈ గ్రామం వచ్చి, వాటిని హోటల్లో విడిచిపెట్టి, వెనకద్వారం గుండా యింటిలోకి వచ్చేవాడు

"ఇంక ఎర్సేల్స్‌లో చెయ్యతగినదేమీ నాకు కనపడలేదు ఈ గ్రామం వచ్చి కావలసిన సమాచారమంతా తెలుసుకున్నాను ఈ యిల్లు కౌంట్ సెంట్‌మిరాన్‌కి చెందినది ఆయన విల్‌ఫర్ట్ మామ ఈ యింటిని ఒక వితంతువుకి అద్దెకిచ్చారని తెలిసింది పోయిన ఆమెభర్త ఒక బారన్ ఆమె ఇంకా యౌవనదశలోనే ఉంది!

"ఒకనాడు ఆ వెనక గోడచాటునుంచి నేను తొంగి చూస్తుండగా ఈ తోటలో ఒంటరిగా పచార్లు చేస్తున్న ఒక చక్కని యువతి కనపడింది ఆమె ఉన్న చోటు ఇంట కిటికీలకుకూడా చాటుగా ఉంది ఆమె విల్‌ఫర్ట్‌కోసం నిరీక్షిస్తోందని ఊహించుకున్నాను ఆమె కొద్ది సమీపంలో ఉండగా పరిశీలించాను దాదాపు పద్దెనిమిదేళ్లుండవచ్చు అందమైనది ఆమె గర్భిణి కూడా కొంతసేపటికి ఒక వ్యక్తి తోటలోకి వచ్చాడు ఆమె గబగబ అడుగులు వేసుకుంటూ అతన్ని సమీపించింది ఇద్దరూ ఆలింగనం చేసుకుని మెల్లిగా ఇంటలోకి నడిచి వెళ్ళిపోయారు అతను ఎల్ ఫర్ట్ అని కనిపెట్టాను"

"ఆ యువతి పేరు నీకు తెలియనే లేదా ?

"లేదండి ఆ సాయంకాలమే అతన్ని చంపిఉండేవాణ్ణి కాని ఆ పరిసరాలు నాకు తెలియలేదు అతను అరిస్తే ఎవరైనా వచ్చి పట్టుకోవచ్చునని భయపడ్డాను మూడు రోజులు ఆ పరిసరాలంతా పరిశీలించి జాగ్రత్తపడ్డాను ఆపైన ఒక సాయంకాలం చీకటిపడిన తరవాత ఒక పరిచారకుడు గబగబా వచ్చి తోట గుమ్మందాటి వీధిలోకి దౌడుతీశాడు మూడుగంటల్లో తిరిగి పరుగుమీద వచ్చి ఇంటిలోకి వెళ్లాడు అతనివెంట ఒక వ్యక్తి గుర్రంమీద వచ్చి ఈగుమ్మంవద్ద దిగి గబగబా లోపలికి వెళ్లాడు విల్‌ఫర్ట్ ముఖం నాకప్పుడు కనపడకపోయినా, నాలో కలిగిన ఆవేశాన్ని బట్టి అతనే అనుకున్నాను కత్తితీసి పిడికట గట్టిగా పట్టుకున్నాను ఎవరూ చూడకుండా గోడెక్కి తోటలోకి దూకాను దూకగానే గుమ్మందగ్గరికి వెళ్లాను తలుపులోనే తాళం చెవిఉంది ఆత్రుతలో దాన్ని అక్కడ మరచిపోయారు తాళంతీసి తలుపు ఓరగిల తెరిచి అట్టేపెట్టాను పారిపోడానికి వీలుగా, ఆపైన తోటంతా జాగ్రత్తగా పరిశీలించాను చెట్లు, పొదలు గుబుర్లుగాఉన్నాయి గుమ్మానికి దారిలోఒక గుబురుచాటున దాగి పొంచున్నాను ఈ గుబురు పక్కనుంచే తోటగుమ్మానికి వెళ్లాలి దాగినచోటికి నాకు ఎవరిగో మూలుగు వినవచ్చింది రెండుగంటలసేపు యింటిలోనుంచి ఈ మూలుగు వినిపించింది అర్ధరాత్రి సరిగ్గా పన్నెండుగంటల వేళకి ఆ వెనక మెట్ల పక్కగది కిటికీ తలుపు తెరుచుకుంది అక్కడనుంచి గుడ్డిదీపపు వెలుగులో మెట్లు స్పష్టంగా కనపడ్డాయి తరవాత పైగది తలుపు తెరుచుకుంది లోనికి వెళ్లినవ్యక్తి మెట్లుదిగి వచ్చాడు కత్తిపట్టుకుని సిద్ధపడ్డాను ఆ వ్యక్తి నేనున్నవైపుకి నడిచివచ్చాడు దగ్గిరపడిన తరవాత అతని చేతిలో ఆయుధమేదో ఉన్నట్లు కనపడింది మరింత దగ్గిరపడగానే అది గడ్డపలుగని తెలిసింది సరిగ్గా నేను నిలబడిన గుబురు దగ్గరకువచ్చి అక్కడే పలుగుతో నేల తవ్వడం ప్రారంభించాడు ఒంటిని చుట్టుకున్న కంబళిలో బరువైనవస్తువేదో దాచినట్లు కూడా కనపడింది మెల్లిగా దాన్ని తీసి పచ్చికపైనపెట్టి రెండు చేతులతోనూ మట్టి తియ్యడం మొదలుపెట్టాడు కింద పెట్టినది రెండడుగుల పొడుగు ఆరంగుళాల మందమూ ఉన్న ఒక పెట్టె వంటవే నా కొక ఆలోచన తట్టింది ఇంతలో అతను పెట్టె ఎత్తి, తవ్విన గోతిలో పెట్టాడు పైన మన్నుకప్పబోతున్నాడు ఆసమయంలో అతనిపైకి దూకి ఛాతీపైన కత్తితో పొడిచాను 'నేనెవరో తెలుసా ? నా పేరు బర్టుక్సియో నా అన్న హత్యకిది ప్రతీకారం నీ ధనం వితంతువుకి పరిహారం నేను కార్సికన్ దేశస్థుణ్ని నా పగ తీర్చుకున్నాను' అన్నాను అరవనైనా అరవకుండా విల్‌ఫర్ట్ పడిపోయాడు క్షణంలో గోతిలోఉన్న పెట్టె అందుకున్నాను పలుగు గోడ అవతల పారేశాను గుమ్మం దాటి వెళ్లి తలుపువేసి పైనుంచి తాళంవేసి చెవిదాచుకుని పరుగుతీశాను"

"అవునవును" అన్నాడు మాంట్ క్రిస్టో "ఎవరో పసిబిడ్డని గురించి నాకు చెప్పావు కాదూ ?"

"అవునండి గబగబా నదిగట్టుకి వెళ్లి అక్కడ కూర్చుని కత్తితో మూత పెళ్లగించి పెట్టె తెరిచాను లోపల చక్కని లినెన్‌గుడ్డలో చుట్టబెట్టిన పసిబిడ్డ కనపడ్డాడు బిడ్డముఖమూ చేతులూ నల్లబడిపోయాయి ఊపిరాడక చనిపోయాడనుకున్నాను కాని ఒళ్లు పూర్తిగా చల్లబడలేదు అందువల్ల నదిలో పారెయ్యడానికి జంకాను కొద్దసేపటిలోనే బిడ్డ కదిలింది బాస్టియా ఆస్పత్రిలో చేసిన ఉద్యోగం అనుభవం జ్ఞప్తికి తెచ్చుకుని ఊపిరితిత్తులకు గాలి అందేలాగ పరిచర్య చేశాను పావుగంటలో బిడ్డ ఊపిరితీసుకున్నాడు తరవాత సన్నగా ఏడ్చాడు సంతోషం పట్టలేక ఒక వెర్రికేక పెట్టాను 'భగవంతుడు నాపై కోపగించలేదు' అనుకున్నాను ఒక ప్రాణాన్ని తీసినందుకు గాను మరొక ప్రాణాన్ని రక్షించే అదృష్టం లభించింది నాకు"

"ఆ బిడ్డనేం చేశావు?" అన్నాడు మాంట్ క్రిస్టో "పారిపోయేవాడికి అది మోయలేని బరువు కాదూ ?"

"అసలా బిడ్డను నేను తీసుకోవాలనే ఊహ నా కప్పుడు తోచనే లేదండి కాని పారిస్‌లో ఇటువంటి బిడ్డలకోసం ఒక ఆస్పత్రి ఉందని నాకు తెలుసును లినెన్‌గుడ్డని రెండుముక్కలుగా చించి ఒకటి నావద్ద దాచి, రెండోది బిడ్డఒంటికి చుట్టాను రెండు ముక్కలమీదా రెండు అక్షరాలున్నాయి బిడ్డని ఆస్పత్రి గుమ్మంవద్ద విడిచిపెట్టి, గంట వాయించి తరవాత పారిపోయాను తరవాత పదిహేనురోజులికి స్వగ్రామం చేరుకున్నాను మా వొదిన్ని ఓరడించడానికి ప్రయత్నించాను

'విచారించకు వొదినా అన్న చనిపోయాడు కాని నేను పగ తీర్చుకున్నాను' అన్నాను ఆమెకు జరిగినదంతా చెప్పాను 'బిడ్డను నువ్వు తీసుకురావలసింది' అంది వొదిన 'ఆబిడ్డ తల్లి దండ్రులు కెవరో మనం తీర్చేవాళ్ళంకదా! దీనికోసమైనా భగవంతుడు, మనల్ని క్షమించి కాపాడేవాడు' దినికి సమాధానంగా నాదగ్గరున్న లినెన్ గుడ్డ ముక్క ఆమె చేతికిచ్చాను ఇది చూపించి పారిస్ ఆస్పత్రినించి బిడ్డను తెచ్చుకోవచ్చని చెప్పాను "

"ఆ గుడ్డ ముక్కపైన ఉన్న అక్షరాలేమిటి?" అన్నాడు మాంటిక్రిస్టో

"హెచ్, యన్ అనే రెండక్షరాలూ ఉన్నాయండి, అది కాక బారన్ పదవి చిహ్నంకూడా ముద్రించబడింది"

"ఈ బిడ్డ ఏమైనాడు? నిన్ను పట్టుకున్నప్పుడు నిన్నెవరని విచారించారు? బుసోనీవద్ద నువ్వు అంగీకరించిన నేరమేమిటి?"

"అదంతా చాలా పెద్దకథండి"

"అయితేం? నేనసలు ఆశ్టే నిద్రపోను నీకు తెలుసుగా? కొద్దిగా నిద్రవస్తుందనుకోను"

బెర్టూచ్చియో అలు వన్నట్లు తలూపి మళ్లీ తన చరిత్ర మొదలు పెట్టాడు

"అంత నామనస్సులోని ఆరాటాన్ని, పాతస్మృతి నీ మరిచిపోడానికి, అంతే మావొదినను పోషించడానికి తిరిగి నేను అక్రమ వ్యాపారంలోకి దిగాను అందరి మైత్రినీ సంపాదించా ను. ప్రభుత్వం చూడనట్లు ఊరుకోడంవల్ల మా వ్యాపారం చక్కగా సాగిపోయింది డబ్బు పుష్కలంగా దొరికేది నేను నా అన్న హత్యకుగురైనది మొదలు గ్రామాలకు వెళ్లనందువల్ల, అక్కడి హోటల్ యజమానులు నమ్మకల్ని సంపాదించుకుంటూ వచ్చాను వచ్చి బెల్గార్డ్—బుకేర్ రోడ్డులో ఒక హోటల్ పెట్టుకున్నాడు అక్రమ వ్యాపారులు తీసుకువచ్చిన సరుకు దాచడానికి ఇటువంటివే డజను రహస్య ప్రదేశాలుండేవి మాకు పోలీసులు పట్టుకోడానికి వస్తే మేము అక్కడికే గాక్కనేవాళ్లం నేను ఎప్పుడు పోలీసుల కంట పడ్డానికి భయపడేవాడిని నన్ను పోలీసులు పట్టుకున్నట్లయితే నా అక్రమ వ్యాపారమే కాదు, నా గతచరిత్రంతా బైటపడుతుంది అందువల్ల పోలీసులకు చిక్కకుండా తప్పించుకోడానికి చావుకైనా సిద్ధపడేవాడిని కాను క్రమంగా నా సంపాదన ఎక్కువైంది, మా వొదిన నా ధనాన్ని జాగ్రత్తపెట్టేది

"ఒకనాడు నే నింటికి వచ్చేసరికి ముందుసావడిలో ఉయ్యాల ఒకటి కనపడింది అందులో ఎనిమిదిమాసాల బిడ్డ నవ్వు లొలకపోస్తూ ఆగుకుంటున్నాడు అప్పుడు నా ఆనందానికి మేర లేదు తన దగ్గరున్న లినెన్ గుడ్డముక్కను చూపించి, బిడ్డను ఎక్కడ ఏ సమయంలో ఆస్పత్రిగుమ్మంవద్ద విడిచిపెట్టానో తెలిపి ఆ పత్రి అధికారుల అనుమతిపొంది మా వొదిన బిడ్డను తీసుకు వచ్చింది 'వొదినా నిన్ను తప్పకుండా భగవంతుడాశీర్వదిస్తాడు' అన్నాను కాని మమ్మల్ని శిక్షించడానికే భగవంతుడీ బిడ్డను పంపాడని అప్పుడు కలలోనైనా ఊహించలేకపోయాను అంతటి వక్రబుద్ధిని, దుర్మార్గుణ్ని భగవంతుడింతవరకూ సృష్టించలేదని పిస్తుంది అది పెంపకంలో దోషంవల్లకూడా సంభవించలేదు పెద్ద పెద్ద నీలికళ్లు, నవ్వు ముఖం, మెరిసిపోతున్న శరీరఛాయ చూస్తే బిడ్డ చాల ముద్దు వచ్చేవాడు కాని పల్చని రంగుతో ఆ జుట్టు వాడి ముఖానికి వింతలక్షణంగా ఉండేది ఆ బిడ్డ నవ్వుతుంటే కనితీర్చుకున్న సంతోషం జ్ఞప్తికి వచ్చేది వాడికి మా వొదిన బెనెడెట్టో అని పేరు పెట్టింది వాడి అతి చిన్నతనంలోనే అనేక దుష్టగుణాలు స్పష్టపడ నారంభించాయి కొంతవరకూ తల్లి గారాబం కారణమైన మాట నిజమే వీడికోసం చక్కని దుస్తులు కుట్టించాలని ఎంత దూరమైనా లెక్కచేయక పాపం వొదిన నగరం వెళ్లి కుట్టించుకు వచ్చేది రకరకాల భక్ష్యాలు తెచ్చిపెట్టేది ఆమె బిడ్డ పెంపకంలోనే తన జీవితానికి సార్థకత ఉందని భ్రమపడి ఏ కష్టానికీ వెను దీసేది కాదు ఆరేళ్లప్పుడు పొరుగింట్లో దొంగతనం చేశాడు కాని మొదట మేము నమ్మలేదు ఒకనాడు సాయంకాలం ఒక కోతిని తీసుకువచ్చాడు అడివిలో ఒక చెట్టుకు కట్టివేసి ఉంటే తెచ్చినట్లు చెప్పాడు 'అడవిలో కోతులు చెట్లకు కట్టి ఉండవు నిజం చెప్పు, ఎలా తెచ్చావ్ దీన్ని?' అని గద్దించి కొట్టబోయాను బెనెడెట్టో నవ్వాడు నాకు కోపం లేదు చెయ్యెత్తాను రెండడుగులు వెనక్కి వేసి ఇలా అన్నాడు 'ఆగు నువ్వెవరు నన్ను కొట్టడానికి? నువ్వు నా తండ్రివి కావు' అని గట్టిగా అరిచాడు

"ఈ రహస్యాన్ని వాడి కెవరు చెప్పారో ఎన్నడూ తెలియలేదు ఈ సమాధానంతో నాకు విపరీతమైన భయం కలిగింది కొట్టలేక చేతితో ముఖం కప్పుకున్నాను బెనెడెట్టో గెలిచాడు నేను వెనక్కి తిరగ్గానే చిత్తం వచ్చినట్లు ప్రవర్తించాడు పద కొండేళ్లకి అల్లరిమూకతో చేరాడు వీడివల్ల పోలీసుల కళ్ల బడవలసివస్తుందని భయపడ్డాను

"ఒకసారి నేను దూరప్రయాణం చెయ్యవలసిన వచ్చింది బెనెడెట్టోనికూడా తీసుకు వెళ్లాలనుకున్నాను దుష్టసహవాసం నుంచి వేరు చేసినట్లయితే కొంత మారవచ్చునని ఆశపడ్డాను కాని నేను చెప్పినదంతా విని ఇలా అన్నాడు 'నేను నాతరహా మార్చుకుని నీ మాదిరిగా అక్రమవ్యాపారంలో దిగుతా ననుకున్నావా? అదెన్నటికీ జరగదు నాకు కావలసినంత ధనం ఉంది నే నడిగినంత లేదనకుండా అమ్మ ఇస్తుంది నేను నీతో రానవసరంలేదు' నాకు నోట మాటరాలేదు బెనెడెట్టో తన మిత్రబృందంవద్దకు వెళ్లిపోయాడు "

"బలే వాడు!" అన్నాడు మాంటిక్రిస్టో

"వాడే నా స్వంతకొడుకైతే దారిలోకి తెగలిగేవాడినే కాని వాడి తండ్రిని చంపి, ఈకొడుకుని కొట్టాలంటే నాకు చేతులు రాలేదు వాణ్ణి గారాబం చెయ్యవద్దని వొదినకు సలహా ఇచ్చాను కాని ఆమె వాడివల్ల తప్పులేదని వాదించింది అయితే చివరికి తనవద్ద తరుచు ధనంపోవడం నిజమేనని ఒప్పుకుంది ఇక పైన జాగ్రత్తకోసం ఒక చోటు చూపించి ధనం అక్కడ దాచమని చెప్పాను

"తరవాత సరుకు తీసుకుని ఫ్రాన్స్‌కి ఒక ఓడలో బయలుదేరాను అప్పటికి ఫ్రాన్స్‌లో శాంతి సుస్థిరపరచబడింది అక్రమ వ్యాపారాన్ని నిరోధించడానికి ప్రభుత్వం బలమైన నిఘా పెట్టింది రోన్‌నదీ ముఖంలో మిగతా ఓడలమధ్యకు చేరి, రాత్రి వేళ సరుకుని తీరానికి చేరవెయ్యాలనినిశ్చయించుకున్నాం కాని మా అజాగ్రత్త వల్లనో, లేక ఎవరైనా ద్రోహులవల్ల జరిగిందో తెలియదు, మా ఓడ రేవు సమీపించే సమయానికి పోలీసులు, తనిఖీ అధికార్లు లాంచీలలో వచ్చి చుట్టుముట్టారు అప్పటికి సాయంకాలమయింది వెంటనే నేను సముద్రంలోకి దూకేశాను ఊపిరి తీసుకోడానికి, అప్పుడప్పుడు నీటిపైకి తేలుతూ వీలైనంతవరకూ నీటిఅడుగునే ఈదుకుంటూ వెళ్లాను బుకేర్ రోడ్డు కలిసేచోట తీర మెక్కాను సైమ్స్‌లో హోటల్ యజమాని ఒకడి సంగతి ఇంతకు ముందే చెప్పాను అతను బెల్‌గార్డ్—బుకేర్ రోడ్డులో పెట్టిన

(47-వ పేజీ చూడండి)

# ధర్మాన్ని ఎదిరిస్తే...

"వీరంరాజు"

ఊరికి ఇద్దరు కరణాలు పెద్ద కరణంపేరు పిచ్చిరాజు, చిన్న కరణంపేరు వీరయ్య పిచ్చిరాజు ఆస్థపరుడు, మంచిపలుకుబడి గలవాడు నల్లగా, పొడుగ్గా, లావుగా వుంటాడు డబ్బు వున్నా ఖర్చుపెట్టేరకంగాడు తెల్లనిధోవతులుకట్టుకుంటే ఎక్కువగా మాస్తవని పాలవెంగాయధోవతులు కట్టేవాడు చెంపకు చేరవేసిమీసాలను ఎప్పుడూ మెలివేసుకుంటూ, చేతిలోని కర్రను గిరగిర త్రిప్పుకుంటూ, ఊళ్ళోకిబయలు దేరాడంటే ఆయన వచ్చేదారిలో ఎంతమొనగాడైన, రైతైనా, సరే, తొలిగి తొలగి పోవలసిందే మంచాలమీద కూర్చున్నవారు లేచి దండాలు పెట్టవలసిందే ఆయనమూరెడుచుట్ట కాలుస్తున్నా సరే, ఏ రైతు ఆయన చూస్తుండగా చుట్ట కాల్చరాదు ఆయనతో మాట్లాడటం అంటే రైతులకుభయం ఇంకస్త్రీల విషయం మరీ అన్యాయం! ఆయన కనుచూపుమేరలో ఏ స్త్రీ కనుపించరాదు ఆయన వస్తున్నప్పుడు ఎవరైన ఎగురు పడ్డారా కర్రతీసుకొని చావగొట్ట వలసిందే! మావూరిలో ఆయన ఆడింది ఆట పాడిందిపాట ఆయన తనజీవిత పర్యంతం ఏడుకాయలు ఆరుపువ్వులలాగా వలిగించాడు ఆయనను ధిక్కరించ గలిగినధైర్యం రైతుల కెవరికీలేదు ఈ విధంగా 'పేనుకు పెత్తన మిస్తేతెల్లవార్లు తెగగొరికినట్లు' తన దర్పాన్ని సాగించాడు పిచ్చిరాజు

రెండవకరణం వీరయ్యగారు ఆయన ఎర్రగా, బక్కపలచగా, అందంగా వుంటాడు ఎప్పుడూ తెల్లని గుడ్డలు వేసుకొని, జరీపేటంచు ఉత్తరీయం కప్పుకొనివుంటాడు ఆయనను రైతులంతా గౌరవిస్తారు కాని ఆయన ఎవరిని కోపపడడు, దూషించడు, తిట్టడు ఆయన సహాయం ఎవరైనా అర్థిస్తే తానెంత శ్రమపడియైన చేస్తాడు ఏకులస్థుడితోనైన సాదరంగా మాట్లాడుతాడు ఎవడికి హాని చెయ్యడు అంతమాత్రంచేత 'ఏ ఎండకా గొడుగుబటు' మనిషికాదు

ఇంక మునసబ్ అబ్బిరెడ్డిగారు నిజంగా రెడ్డిరాజులే ఈయన పెద్దరైతు, ధనవంతుడు, చదువుకున్నవాడు, మర్యాదస్థుడు రెడ్డి కులస్థుడైనా పచ్చనివాడు చెంపకు చేరవేసి కన్నులు, ఎప్పుడూ చిరునవ్వు ఆయనముఖంలో తాండవిస్తుంటుంది ఎప్పుడు చూచినా మొగలిపూవు లాంటి దుస్తులలో వుంటాడు పేటంచు ఉత్తరీయం తలగుడ్డచుట్టి గుర్రంమీద బయలుదేరుతాడు ఊరిలోకి వీరయ్యగారికి అబ్బిరెడ్డిగారికి గాఢస్నేహం ఏపని చేసినా ఇద్దరు పరస్పరం ఆలోచించి చేస్తారు

ఒకరోజున పిచ్చిరాజుగారితో మాట్లాడటానికి వచ్చాడు 'రంగం' అనే రైతు కుర్రవాడు ఆజానబాహువంటి మనిషి, జల్సాగా, ఖర్చుచేస్తాడు, ఫెళఫెళ మనే గుడ్డలు వేసుకొని, చెప్పులు కిర్రుకిర్రు మనిపిస్తూ ధీమాగానడుస్తాడు పైగా కొంచం చదువుకున్న మనిషి, చదువుకున్నవారు గౌరవింపబడాలనే కోరికగలవాడు దూరంనుంచే చూచాడు పిచ్చిరాజు రంగాన్ని

"ఓరి వీడితస్సదియ్యా! వీడికింత నీటా! కణాల బజారులో వీడి దర్జా అంతా మండిస్తున్నాడే" అని అనుకున్నాడు కరణంగారు

రంగం నేరుగా పిచ్చిరాజుగారి ఇంట్లోకి ప్రవేశించి, చెప్పులు ఆరుబయట విడవకుండా, తలగుడ్డ చేతులో పట్టుకోకుండా, సరాసరే ఆయన దగ్గరికి సమీపించి," కర్ణంగారు, మీతో పని వుండి వచ్చానండి" అన్నాడు

పిచ్చిరాజుగారికి ఆపాదమస్తకం వళ్లు మండిపోతున్నది చెప్పులు విడువకుండా, తలగుడ్డ చేతుల్లోకి తీసుకోకుండా, దూరంగా నిలబడకుండా, ఎంతో దగ్గర బంధువులాగా సమీపానికే వచ్చి, దణ్ణం దస్కంలేకుండా వచ్చిన రంగాన్ని చూచాడు పిచ్చిరాజుగారు పొగలు కక్కుతూ రంగానికి కొంచం అనుమానం కలిగింది కరణంగారి వైఖరిచూచే టప్పటికి.

పిచ్చిరాజుగారికి రెండు కనుబొమలు ముడిపడగా కోపదృష్టితో "ఏయి! ఎవరోయి నీవు? పరువు మర్యాదలేమి తెలియవానీకు ?"

"ఏమండి తెలియక నేనేం అపరాధం చెయ్యలేదే" అని జవాబిచ్చాడు రంగం కరణంగారితో ఏంమాట్లాడాలో తెలియక

"ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా"

"కర్ణంగారితో నే గదండి"

"ఆ ఆ— కరణంగారితో నా దొర గారితో గాదన్నమాట"

"మీరు కరణంగారుగాబట్టి కరణంగారన్నాను, దొరగారైవరండి దొరగారంటారు"

"నీకుబుద్ధిలేదూ! దొరగారెవరో తెలియదా! ఉండు నాయనా తెలుస్తుందిలే ఏంపొగరు ఏం గర్వం నిన్నగాక మొన్న కళ్ళుదెరచిన వెధవవునీవు. ఓహో! చదువుకున్నాననే ఉంరా నీచదువు, పసేంటో తేలుస్తా" అని గబగబ అరిచాడు పిచ్చిరాజు

"ఏమండోయి! మీరు కరణంగారు కావచ్చు నేనురైతును కావచ్చు అంతమాత్రంచేత దొరగారని అనాలా"

"ఓరినీగొంతు గొయ్య! మింగమెతుకు లేదు మీసాలకు సంపెంగ నూనట నిన్ను నాశనం చెయ్యంది వీడు పిచ్చిరాజుగాదు సరేనా "

"ఏమండోయి! జాగ్రత్తగా మాట్లాడండి నేనూ కొంచం ప్రపంచంతిరిగాను మీలాంటి కరణాలను చాలామందిని చూచాను" అని తిరస్కార భావంతో ధీమాగా నడిచిపొయ్యాడు వీరి మాటలు బయటినుంచే వింటున్నరైతులు "వీడికి ఏం! పోయేకాల మొచ్చిందో" అని అనుకుంటూ ఆశ్చర్యంతో చూచారు రంగాన్ని కొంతమంది పెద్దరైతులు చేతులు నలుపుకుంటూవచ్చి," దొరగారు కరుణించాలి! రంగం కుర్రవాడు వడీ మధ్యనే తూర్పునించి వచ్చాడు ఇక్క పరువు మర్యాదలు వాడికి తెలియవండీ దొరా!" అని కాళ్లవేళ్లబడి ప్రార్థించారు. "ఆ మాటవరస కన్నానుగాని వాడిని నాశనంచేస్తా నేమిటి" అన్నాడు పిచ్చిరాజు నవ్వుతూ

రెండు సంవత్సరాలు గడచిపోయ్యాయి రంగం మావూరిలో ఒక మోద్దుబరీరైతు కొడుకు మళ్లా ఎప్పుడు వీరిద్దరు కలువ లేదు, తగాదా లేదు

మావూరికి స్ఫోటకం, మహామ్మారీ, కలరాలాంటి ముగ్గురు గజటక్కరులున్నారు వారంటే ఎంత గొప్పవారికైన భయం మంచి మాట కారులు ఎంతవారినైన నిమిషంలో బుట్టలో వేసుకుంటారు వీరిని పిలిపించిమాట్లాడాడు పిచ్చిరాజు

కొద్దికాలంలోకల్ల రంగానికి ముగ్గురు టక్కరులకు మంచి స్నేహం కుదిరింది రైతులంతా అనుకున్నారు "రంగం చదువుకున్నాడేగాని ఈపిశాచాల స్నేహం పట్టాడే వీడికేదో మూడింది "

రామన్న అనే ఇంకొక రైతుకు చింతమ్మ అనే విధవ ఆడబడుచువున్నది ఆమెకు చిన్నతనంలోనే భర్త చనిపోవటంవల్ల పుట్టింటి వారిచ్చిన ఆస్తిని నమ్ముకొని పుట్టింటి లోనే వేరె గదిలోవుండేది ఆమె దగ్గర కొంతసొమ్ము, రొఖ్ఖం వున్నదనివాడుక ఆమె కొంచంగుణం తక్కువైన మనిషి. అది అందరికి తెలిసిన విషయమే

నిమ్మలచింపిరి, టక్కరులలో ఒకడు, రంగానికి చింతమ్మను గురించి చెప్పాడు కుమ్మరి లక్షుంగాడు అనే రెండవటక్కరి చింతమ్మను ఏలాగైనా రంగానికి వశం చేస్తానన్నాడు కోట్టేదాసరి, మూడవ టక్కరు, ఆమెదగ్గరనున్న సొమ్ము, డబ్బు కొట్టేదామన్నాడు పాపం! రంగం యీ టక్కరుల మాయలో పడ్డాడు రంగం తండ్రిఎన్నోమార్లు చెప్పాడు వీరితో తిరగ వద్దని కాని తెలివిగల వాడననే ధిమాతో తండ్రిమాటలు విన్నాడుకాదు

ఆరోజు అమావాస్య కన్నుపొడుచుకున్నా పక్కవాడు కనపడడు రంగం టక్కరులతో సహా చింతమ్మ ఇంటి ముందుకు చేరాడు "రంగం, నీకేం భయం లేదు యీవూరిలో ఈ చింపిరి బొందిలో ప్రాణాలుండగా నీకెందుకు భయం మాతో చెప్పినట్లుగా చింతమ్మవాకిటి తలుపు తెరిచే వుంటుంది" అన్నాడు చింపిరి

"రంగం! దానితో నెమ్మదిగా స్నేహం చేశావా దాని డబ్బు, దానిసొమ్ము మన పాలిటపడ్డట్టే తొందరపడవాకు జాగ్రత" అన్నాడు లక్షుంగాడు

"రంగం! ఈ బజారు చివరకు వెళ్ళి మన బజారుకు ఎవరిని రానియ్యకుండా చూస్తాను నీ పంట పడింది నీ యిష్ట మొచ్చినంతసేపు అనుభవించిరా" అని దాసరి ఒకదుడ్డుకర్ర తీసుకొని వీధిచివర కెళ్ళాడు

చింపిరి, లక్షుంగాడు రంగాన్ని లోపలికి పంపివేసి బయటగడివేశారు లక్షుంగాడు వూరిమధ్యకు పరిగెత్తుకుంటూ వెళ్ళి "దొంగ దొంగ" అని అరిచాడు ఆడవాళ్ళు మొగవాళ్ళు కఱ్ఱలు రోకళ్ళు తీసుకొని లక్షుణగాడి వెంబడి చింతమ్మ ఇంటికి పరుగెత్తుకుంటూ వెళ్ళారు

రెండవవైపునుంచి చింపిరి కరణంగారిని తీసుకొనివచ్చాడు చింతమ్మ ఇంటిని ముట్టడించి దొంగను బయటికి తీసుకొచ్చి తలా వకటి పొడిచారు రంగం కుయిక్కుయికన కుండా అట్లాగే దెబ్బలు భరించాడు కరణంగారొచ్చేటప్పటికి ఇసుకవేస్తే రాల కుండా జనం ఆ అర్థరాత్రే కిటకిట లాడుతూ వున్నారు

"కరణంగారు వచ్చారు కరణంగారు వచ్చారు" అని ప్రజలంతా దారియిచ్చారు ఒకడు కుర్చీతీసుకొచ్చివేశాడు చాకలి రంగడు దీవిటీ వెలిగించాడు రైతులంతా దూరదూరంగా నిల్చున్నారు కరణంగారేం చేస్తారో చూద్దామని

"ఒరే చింపిరీ! ఆదొంగ ఎవడురా?"

"అయ్యా! చదువుకున్నానని మిడిసి పడే రంగంగారండి "

"ఏంటి రంగమా రంగమే ఈవేళ వీడిబుద్ధిగడ్డితిన్నదేం " అన్నాడు ఆశ్చర్యం వెలిపుస్తున్నట్లు నటిస్తూ

"ఒరే చూస్తారేంరా, ముందువీడికి మంగళహారతు లివ్వండిరా ఊ చూస్తారెందుకు కానివ్వండి "

చింపిరి, దాసరి, లక్షుంగాడు రంగాన్ని



చితకబాదిచారు ఎముకల్లో సున్నం లేకుండా గుద్దారు, తన్నారు రంగం ఒళ్ళంతా గుల్ల యింది

రైతులంతా ఒకరిమొగం ఒకరుచూచుకున్నారు టక్కరులతో స్నేహంచేసినందుకు రంగానికి తగిన శాస్తి యిందనుకున్నారు "ఇదంతా ఎచ్చిరాజుగారి ఎత్తేమో" నని కొంతమంది తెలివిగలవారు అనుకున్నారు

"ఓహో! రంగంగారూ! నే నెవరినో తెలిసిందా నా లాంటి కరణాలను ఎంతమందినో చూచానంటివి గదరా నీవు ఒరే మొహితాద్ చింతమ్మను పిలుచుకురా కోళ్ళు తీసుకొనిరా వచ్చేటప్పుడు అని చింతనిప్పులు గక్కుతూ హుకుంజారీ చేశాడు

చింతమ్మ గడగడవణకుతూ చేతులు జోడించుకొని వచ్చింది కరణంగారు పిలిపించారనే టప్పటికి చింతమ్మకు పైప్రాణాలు పైనపోయినవి దేహశుద్ధిజరుగుతుందేమోనని భయపడ్డది

"చింతమ్మా! నీకే భయంలేదు ఇదుగో నాకాలి చెప్పుతీసుకొని రంగాన్ని నీ యిష్టమొచ్చినన్ని కొట్టు నీ ఇంటికి దొంగతనానికి వచ్చాడూ మొనగాడు

చింతమ్మ మొఖంమీద నోటిమీద గుండెమీద తలమీద దెబ్బపైన దెబ్బ కొట్టింది చెప్పుతో

"ఓరే! చింపిరీ, బికారీ దాసరీ ఇటు రాండిరా ఆకోళ్ళు తీసుకొచ్చి వాడి గుండెమీద దంచండిరా" అన్నాడు ఎచ్చిరాజు

రంగాన్ని పండబెట్టి కోళ్ళతో దంచటం ఆరంభించారు రంగం ఏవేవో కేకలు వెయ్యటం సాగించాడు కొంతసేపటికి సత్తువంతా చచ్చిపోయింది రంగానికి నోటి వెంబడి రక్తంగారింది

"అరే! ఇంక ఆపండిరా చస్తాడేమో"

రైతు లెవ్వరు జోక్యం కలిగించుకోలేదు రంగం తండ్రి ఆస్తిపరుడైన కరణం అంటే భయం వల్ల ఏం అనలేదు రంగం మూడురోజులకు గుండెపగిలి అవమానంతో కుమిలిపోతూ చచ్చిపోయ్యాడు

మళ్ళీ పిచ్చిరాజు కోపానికి ఎఱ అయినవాడు మునసబ్ అబ్బిరెడ్డి ఒకరోజు అబ్బిరెడ్డి గుమ్మంమీద కూర్చొని మా ఇంటిముందు మా తాత వీరయ్యగారితో మాట్లాడుతున్నాడు మా తాతవిదో తువాలు వేసుకొని ఎచ్చాపాటి మాట్లాడుతున్నాడు ఇదంతా తన యింటి అరుగుమీద కూర్చొనిచూస్తున్నాడు పిచ్చిరాజు అబ్బిరెడ్డిపోగానే ఎచ్చిరాజు మా ఇంటికొచ్చాడు

"ఒరే వీరయ్యా! ఏం కరణానివిరా నీవు నీ కరిణీకంమడ కరణంగౌరవాన్ని మంట గలుపుతున్నావుగదరా"



"ఏం! బావగారు ఇవ్వాళేదో కారం తిన్నట్లున్నదే"

"నీ ఎకచక్కాలు విడిచినట్లున్నదిలే అబ్బిరెడ్డి ఎంత మొనగాడైతే మాత్రం గుమ్మంమీదనుంచి క్రిందకుదికకుండా రాజాలాగా మాట్లాడుతాడటరా కరణంతో"

"పోనివ్వండి బావగారు! ఏదో సరసుడు స్నేహితుడు విద్యావంతుడు అతడెక్కడుండి మాట్లాడితే మనసొమ్మేం పోయింది"

"అట్లనా! నీకు కరిణీకం యిచ్చిన వెధవను అనాలిరా మీ అబ్బలంతా వట్టి మెతకరకం ఈ అబ్బిరెడ్డనే గర్వగిరింపచకపోతే నేను ఎచ్చిరాజునేగాదు నీకుసిగ్గులేకపోతే నాకు లేదూ" అని చకచక వెళ్ళిపొయ్యాడు

కాలచక్రం నాలుసంవత్సరాలు గరా గరా తిరిగిపోయింది

ఒకరోజు ఉదయం రాములవారి మేడదగ్గర జనం యిసుకవేస్తే రాలకుండా వున్నారు కరణాలు మునసబ్ అంతా అరుగుపైన కూర్చున్నారు

ఒక స్త్రీ ఏడుస్తూ వారిముందు నిల్చున్నది ఆమెకు ఎవరో ఒక చెవుకోసివేశారు ఆమెకు అనుమానం వున్నవాళ్ళ పేర్లుచెప్పి పోలీస్ రిపోర్టుకు స్టేట్‌మెంటు యిచ్చింది మునసబ్ జరిగింది జరిగినట్లుగా వ్రాశాడు

ఇతలోకే రైతులు కొందరు మునసబ్ గారిని యివతలకుపిల్చారు ఏదో మాట్లాడారు వెంటనే తాను వ్రాసినస్టేట్‌మెంట్ పరపరచించి వేశాడు ఇదంతా ఓరగన్నుతో చూస్తున్నాడు ఎచ్చిరాజు 'చిక్కిందిరాఎట్ట!' అని అనుకున్నాడు కరణం

మునసబ్ ఇవతలకువచ్చి తగాదాసర్దుబాటుచేసి ఆ స్త్రీకి కొంతడబ్బు యిప్పించి రిపోర్టుసరిగ్గా వ్రాశాడు తరువాత పోలీసువారువచ్చి వారిని వీరిని యిద్దరిని అదిరించి బెదిరించి నాల్గుకాజేసి వెళ్ళిపొయ్యారు చెవుకోసినవారికి తలా ఒకనెల శిక్షపడ్డది

ఎచ్చిరాజు రాములవారి మేడ వెనుకకు వెళ్ళి మునసబ్ చింపివేసిన స్టేట్‌మెంటు కాగితపు పేలికలను జాగ్రత్తగాఏరి ఇంటికి వచ్చి, వాటిని వేరేకాగితంమీద అంటించి జిల్లాకలెక్టరుకు పెద్దపిటిషన్ దాఖలు చేశాడు జిల్లాకలెక్టరు విచారణకు వచ్చాడు మునసబ్ దస్తూరీగుర్తుపట్టి పైకి రిపోర్టువ్రాసి మునసబ్‌కు ఒకసంవత్సరం శిక్ష వేయించాడు కలెక్టర్

(27-వ పేజీ చూడండి)

**కథానిక:**




రామ్మూర్తి నిద్రనించి లేచేటప్పటికి సాయంకాలం నాలుగు గంటలయింది. బద్ధకంగా వీధి గుమ్మంలోకి వచ్చాడు చూరు బల్లమీద నెయ్యిపెట్టి తపతపా కొడుతున్నాడు చేత్తో. నోరు అప్రయత్నంగా ఏదో పాట పాడేస్తూంది.

ఇంతలో గోపాలం సైకలుమీద వెళ్లిపోతూ "హ్యాట్ సార్" అన్నాడు. రామ్మూర్తి నవ్వి "ఏముంది...అన్నట్టు ఆగవోయ్!" అన్నాడు.

గోపాలం అలా సైకలు మళ్లించుకొని వచ్చి ఆగాడు ఒక కాలు మెట్లమీద వుంచి అన్నాడు. "ఏమిటి?"

"నిలబడు" అని లోపలికి వెళ్ళాడు రామ్మూర్తి. తిరిగివస్తూన్నప్పుడు నట్టింటి దగ్గరే ఆగి.

"అ ‌ ‌మ్మ! నా బీరువామీది పెట్టిమీద రెండు రూపాయలుంచేను ఎవరైనా తీసేరా?" అన్నాడు.

తల్లి బియ్యం బాగు చేస్తూన్నదల్లా తలపైకెత్తి "ఆఁ-?" అన్నది దీర్ఘంగా. రామ్మూర్తి ప్రశ్న తిరిగివేశాడు.

"నాకు తెలీదు నాయనా!" అన్నది ఆవిడ.

"అయితే, మరి ఏమయినట్టు?"-ఎవరో తీసేవుండాలి; లేకపోతే వాటికి కాళ్లొచ్చి నడిచిపోయాయా?" అని రామ్మూర్తి వీధిలో కొచ్చాడు.

"ఏమిటి, బ్రదర్?" అన్నాడు గోపాలం.

"ఏమీ లేదు. నీకు రెండురూపాయలివ్వాలిగా పొద్దున్న రమణమూర్తి నాకివ్వవలసిన రెండురూపాయలూ ఇచ్చేశాడు. అది నీకిచ్చేద్దామని నిలబెడమన్నాను,—కాని మా వాళ్లున్నారే, దేవాంతకులయ్యా—నిద్రపోయి లేచేసరికే ఎవరో కొట్టేశారు" అన్నాడు రామ్మూర్తి.

"అన్నన్నా! అయితే వేగం వెళ్లి కనుక్కో, లేకపోతే కాలక్షేపంగాని పట్టెయ్యగలదు."

"—రేపు ఇచ్చేస్తాన్లే"

"ఫరవాలేదులే" అని గోపాలం సైకిలు తొక్కుకు వెళ్లిపోయాడు.

"అయితే రెండురూపాయలు యేమైనట్టు?" అన్నాడు రామ్మూర్తి తల్లితో.

"అదేమో, నాయనా! వాసుగాని తీసేడో ఏమిటో అకతాయివెధవ!" అన్నది తల్లి.

ఆఁ - వాడే తీసుంటాడు. అసలు వాడేడీ?"

"ఏమో - నువ్వు పడుకున్నావు, వాడూ, సోమన్నా చిన్నన్నా అందరూ కొంతసేపు ఇటూ అటూ తిరిగి వెళ్లిపోయారు"

"నా గదిలో కొచ్చాడా?"

"ఏమో, ఒచ్చే వుంటాడు. అటూ యిటూ తెగ తిరిగేడు"

"వాడిదెబ్బే యిది. గదిలో కొచ్చేడంటే కనబడతాయి. తీసుక పట్టుకుపోతాడు."

"అవును. ఎదురుగుండా ఎందుకు పెట్టేవ్?"

"ఎదురుగుండా అంటే వీడిలా తీసేస్తాడని నేనేం కలగన్నానా ఏమిటి? జాగర్తగా బీరువామీద పెట్టేనుమరి."

"ఎంత బావుందిరా, వాడిలాటివాడని ఎన్నడూ ఎరగనట్టు చెబుతున్నావు!"

"ఉండు, వాడు రానీ చెప్తాను, చితకొట్టేస్తాను వెధవని, మరెప్పుడూ యిలాంటి పనులు చెయ్యకుండాను."

"వాణ్ణి కొడితే యిచ్చేస్తాడేంటి? యీపాటికి కప్పడే అయ్యేపోయుంటాయి. వెధవ, రెండు రూపాయలు అంటే యెంత?"

"మేట్నీ కొట్టేసుంటాడు, వెధవ!"

ఇంతలో వీధి గుమ్మంలో ముకుందరావు ఆగమనాన్ని సూచిస్తూ "హోయి!" అని ఓ కేక వినపడ్డది. రామ్మూర్తి ఉగ్రంగా అటు వెళ్లి చూశాడు.

వాసు ఈలవేసి ఎకాయెకీ రెండో మెట్టుమీదికి దుమికి చేతులోవున్న మూడు పేటల నులకతాడుని స్తంభానికి చుట్టి "హంటర్ వాలీకి బేటీ!" అన్నాడు.

"వెధవా ఎక్కడరా చచ్చేవు ఇంతసేపాయిన్నీ?" అని ఉగ్రుడై ప్రశ్నించాడు రామ్మూర్తి. వాసు మెట్లన్నీ యెక్కివొస్తుండగానే వాడి చేతులో కొరడా లాక్కున్నాడు.

"ఆఁ యేమిటి-రా, ఆదివారంనాడు కూడా నీ యధికారమే కాబోసు," అన్నాడు వాసు

"వెధవా! ఆదివారం అయితే అధికారం వదులుకోవాలిరా?" అని కొట్టబోయేడు రామ్మూర్తి

"ఆఁ - అమ్మో - నా హంట రిచ్చేరా!" అని ఏడుపుమొహం పెట్టాడు వాసు

వాడి చెవి పట్టుకుని లోపలి వాకిట్లోకి ఈడ్చుకొస్తూ "రా! నీ కివాళ వుంది ఎడపెడ లగ్గం" అన్నాడు తల్లి నట్టింట్లోంచి "ఒరే వాణ్ణి కొట్టకుమీ" అన్నది

"నిజం చెప్పు, నా బీరువామీది రెండు రూపాయలు ఎవరు తీసేరు? ఎందుకు తీసేవు?"

"నే న్తియ్యలేదురా!" అన్నాడు వాసు చెవిబాధతో

"ఊఁ - తియ్యలేదూ? వెధవా? ఓ వెధవపనికితోడు అబద్ధం కూడానా?" అని చెవి ఇంకా మెలిపెట్టాడు రామ్మూర్తి

వాసు ఏడుపు లంకించుకున్నాడు దాంతో రామ్మూర్తి వాణ్ణి వొదిలాడు

"కెల్లకొడితేనా వెధవని" అన్నాడు

"ఎందుకురా వాణ్ణలా కొడతావ్?" అంటూ తల్లి రంగంలో ప్రవేశించింది

"మళ్లీ జన్మలో యిలాటి పన్లు చెయ్యకుండాను!"

"నే తీస్తే నీ తోడురా?" అని ఏడుపులోంచి వాసు అన్నాడు

"వెధవా! నే న్చస్తే నీకెంత సులభంగా వుందిరా?" అని "వెల్ల" కొట్టేడు రామ్మూర్తి వాడు స్వరం పంచమం లోంచి షడ్జమానికి పోనిచ్చాడు

"వాడు తియ్యలేదురా! ఎందుకలా చెయిజేసుకుంటావూ?" అన్నది తల్లి

"తీస్తే మాత్రం వాడు చెప్తాట్టమ్మా? ఇన్ని ఒక్లైనా వేసుకుంటాడుగాని కొప్పుడు అవు నింతలో ఏమిటి చేసేవురా రెండ్రూపాయలున్నూ?" అని రామ్మూర్తి వాసు జేబులో చెయ్యిపెట్ట బోయాడు

వాసు ముక్కు చీదుకుంటూ "ఉండు, కావలిస్తే నే న్తీసిస్తాను," అని గబగబా జేబులోంచి తియ్యసాగాడు ధనరూపంలో అణాకానీ వుంది ఒక పగడమూ, నాలుగు గురిగింజలూ, కొత్తల నారముల్లు రెండు, ఓ చిన్న బొంగరమూ, సులకతాడూ పంట్లాం జేబులో వున్నాయి చొక్కా జేబులో నలిగిపోయిన సంపెంగ పువ్వొకటి ఉంది

"వెధవ - అప్పుడే ఖర్చు పెట్టేసేవు! అణా కానీ యేత్రా మిగిలింది?" అన్నాడు రామ్మూర్తి

"వాడు తియ్యలేదురా!" అన్నది తల్లి

చటుక్కున రామ్మూర్తికి ఓ ఆలోచన కలిగింది అమ్మ తీసిందేమో!-అవును నాన్న యింట్లో లేనప్పుడు చిల్లరఖర్చు ఏదేనా పెట్టవలసివస్తే ఎదురుగుండా కనబడుతూన్న డబ్బులు తీసుకోకేం జేస్తుంది? మళ్ళీ యిచ్చేద్దామనుకొని తీసుకొనేవుంటుంది

"ఆఁ - ఎవరు తీసేరో నాకు తెలిసింది" అన్నాడు రామ్మూర్తి నవ్వు తెచ్చుకొని; నిజంగా తెలిసినవాడిలాగే

"ఎవరు తీసేరు?" అన్నది తల్లి

"- నువ్వే!"

"ఛీ -"

ఇంతలో వాసు అరవసాగాడు, 'ఆఁ ఆఁ అమ్మే తీసి నామీద పెట్టేసింది"

"- ఇందాట నువ్వా గదిలో కెళ్ళలేదూ?"

"ఇదే బావుంది వెళ్లు, వెళ్లు, నే నా రూపాయ లేమిటో ఎరగను విమలగాని తీసిందో ఏమిటో - ఇందాట అదీ మీ నాన్నగారూ ఏదో రూపాయలనీ అదనీ మాట్లాడేరు"

"ఉట్టిదే, నువ్వు తియ్యలేదంటూ మేమో అని విమలమీద పెట్టేస్తున్నావ్!-నా రూపాయల్నా కిచ్చే—" అన్నాడు రామ్మూర్తి చిన్న పిల్లడిలాగ

వాసు గబగబా వెళ్లి పక్కింట్లోవున్న విమలని ఏదో కొంపములిగిపోయినంత ప్రమాదం కబురు చెప్పి తీసుకొచ్చేశాడు

"ఏమిటన్నయ్యా!" అని విమల చాలా గాభరాగా అంది

"అన్నయ్యవి రెండ్రూపాయలు పోయేయట బీరువామీద పెట్టిమీదపెట్టేట్ట; నువుగాని తీసేవా?"

"ఓ యబ్బ - ఇంతేనా! ఏమిటో అయిపోయిందనుకున్నాను, బాబూ"

"అబ్బ - దూద్దూ దుక్కలాగ రెండ్రూపాయలూ పోతే ఒస్ ఇంతేనా అంటోంది!" అన్నాడు రామ్మూర్తి

"బావుంది ఎక్కడ పెట్టేవో వెతుక్కుంటే సరి!"

ఇదే తీసుంటుందన్నయ్యా - అంగుళ్కెంత నిబ్బరంగా మాట్లాడుతున్నాది" అన్నాడు వాసు

"వెధవా! నే తీసేన్రా?" అని విమల వెనక్కి తిరిగి వాసుని తపతపా రెండు అంటించింది

"అస్తమానూ వాణ్ణలా కొడతా రెందుక్రా?"

"- ఊఁ - కొట్టక ముద్దెస్తారు వీణ్ని. తిరుగూ మని దొంగతనం అంటగడుతున్నాడు ఇవాళ రెండ్రూపాయలు అయింది రేపు మరోటవుతుంది అప్పుడు నేను చచ్చిపోవాలి," అన్నది విమల ఏడుపు మొహంతో

"బావుందర్రా! ఇద్దరూ ఏడుస్తూ కూచోండి," అంది తల్లి

"అయితే నా రూపాయలు యాకైనట్టు?"

"హ్రూ ఏరుస్!" అన్నాడు వాసు నవ్వి

"ఊఁ - యేడుస్తారు ఏడవకేం జేస్తారు? వెధవ వీడే తీసేడు అందుకే వీడి కంత వటకారంగా వుంది వెధవా ఏం చేసేవురా అంత డబ్బున్నూ?" అని ఒకటి తగల్నిచ్చాడు వాసుకి రామ్మూర్తి

"బావుందర్రా సాగుసు ఇంక వాణ్ని వొదల్రు గావోసు," అంది తల్లి

వాసు ఏడుస్తున్నాడు "నే న్తియ్యలేదురా కావలిస్తే సరస్వతోడు వేస్తానురా!" అన్నాడు

"ఒరే, నువ్వు నీ గదిలో ఓమాటు సుబ్బరంగా వెతుకు, ముందర! అదికి ముందే వాణ్ణి కొట్టడం ప్రారంభించావు!" అన్నది తల్లి

ఎంతో అనుకొనం లేదు అయినా తల్లి ఒకవేళ తీసి మళ్ళీ అక్కడ పెట్టేసిందేమో అని అనుమానం కలిగింది రామ్మూర్తికి గబగబా వెళ్లిచూశాడు ఆ రూపాయ లెక్కడా లేవు ఒక వేళ జేబులోగాని వుంచేసి ఇలా భ్రమపడ్డం జరిగిందేమో అని అక్కడా చూశాడు ఇంకా ఎక్కడెక్కడ పెట్టడానికి వీలుంటుందో అక్కడంతా చూశాడు ఆనక వీల్లేనిచోట్ల కూడా చూశాడు ఆ గదిలో ఎక్కడా లేదు పోనీ యిటువేపు గదిలో ఎక్కడయినా వుంటుందేమో అని వెతికితే యెక్కడా లేవు—"

"ఈగదిలో ఎవళ్లు పడేస్తార్రా?" అన్నది తల్లి

"నీకు తెలీదమ్మ, యీ యింట్లో మనుషులసంగతి వాళ్లు స్వతహాగా మంచి

వాస్తే పాపం, కాని వాళ్ళ చేతులు మాత్రం మంచివిగావు, నోళ్ళంతకన్నా మంచివిగావు ముఖ్యంగా యీ వెధవ-" అని పక్కనే వున్న వాసు చెవిపట్టుకున్నారు రామ్మూర్తి

"ఏం వుందిరా వాలకం, మాటమాటకీ వాణ్ణి కొడుతుండడం! - వాడు తియ్యలేరు ముర్రో అంటూంటే ఎందుకలా వాణ్ణి హింసపెడతావూ? ఇదే ఏం వుంది రోయి నువ్వెక్కడో పారేసుకుని వాణ్ణి తంతున్నావ్ ఆ గదిలో కెవరొచ్చారో ఏమిటో నువ్వు నిద్దరపోతున్నప్పుడు" అన్నది తల్లి

విమల చటుక్కున "అన్నయ్యా! ఒకవేళ నాన్న తీసేరేమో రా?" అన్నది

అలా అని చిన్ననవ్వు నవ్వి నోట్లో చిటికెనవేలు పెట్టుకుంది విమల అది రామ్మూర్తికి అవమానం అనిపించింది "ఆఖరుకంత లోకువయ్యా నన్నమాట ఏడిపించండి, ఏడిపించండి డబ్బుపోయి అవమానం వొచ్చి అన్ని వేడుకలూ అయినాయి పోనివ్వండి ఎంతకీ స్వయంకృతాపరాధం! అనుభవించక తప్పదు," అన్నాడతను

"అదికాదన్నయ్యా! ఇందాట నువ్వు నిద్రపోతున్నప్పుడు నాన్న ఇటొచ్చి ఆ బీరువామీద డబ్బెవర్దే అని అడిగేర్రా! అంతే నీది కావొచ్చని చెప్పా నన్నయ్యా అప్పటి కాయన వీధిలోకి వెళుతున్నారు ఏదో అవుసర మొచ్చింది కాబోసు, సంగుబుపెట్టె తియ్యడానికి బద్ధకమై, పోనీ ఎదురుగుండా వుందిగదా అని తీసుకొనుంటారు," అన్నది విమల నెమ్మదిగా

ఇది నిజమే అనిపించింది రామ్మూర్తికి ఇంకో అరగంటకి మళ్లా అందరూ సావిట్లో చేరారు

"మధ్యాన్నం నా బీరువామీద రెండు రూపాయలు మీరేనా తీసేరు, నాన్నా?" అన్నాడు రామ్మూర్తి నవ్వుతూ

"అయిందీ, ఆ రెండురూపాయలూ పోయాయీ అప్పుడే?" అన్నాడాయన తెల్లబోయి

"ఆఁ ఆఁ గమ్మత్తులు"

"నీమొహం ఇందాట నే నడిగేను విమల్ని ఆ బీరువా మీద డబ్బెవర్దనీ అంటే అన్నయ్యది కాబోసు అందది అనీసి అదలా వదిలిపోయింది నే నిలా వొచ్చాను ఇంతట్లో మీ మామకి కార్డు రాదామని జ్ఞాపకమొచ్చింది కార్డు తీసి కొంతసేపు రాశాను రాస్తూవుంటే నీకోసం మేడెపల్లివారి చిట్టబాబొచ్చాడు రామ్మూర్తున్నాడా, అంటే పరధ్యానంగా, వున్నాడు గావోలు చూసుగో అన్నాను వాడికి మఱి గదిలో ప్రవేశం వుందిగా! వెళ్లేడు అంటేసుంటాడు - మీ అమ్మనడిగి తీసుకో మరేం జేస్తాం? అలాంటి వాడితో స్నేహంచేస్తే అంతేనని నే నెంత చెప్పినా విన్నావ్?" చూసేడు చూసేడు ఇవాళ అవకాశం దొరికింది కొట్టేసేడు తగినశాస్తి చేసేడులే"

"ఆఁ- అనుకున్నంత పని అయింది చిట్టిబాబే వస్తే యినప్పెట్టలూ, సందుగు పెట్టెలే ఆగవు అలా యిష్టమొచ్చినట్టు పడేస్తే వుంటుందా? అందులో పోనీ మరోటీ మరోటేనా? డబ్బారోను ఎలాటి వాణ్ణైనా యిట్టే మార్చేస్తుంది అందులో చిట్టిబాబునా? కొలుకింది కేడీ వాడు!" అన్నది తల్లి

"పోనీ వో ఘడియుంగు మామ్మగాని తీసిందేమో కనుక్కుందాం ఎక్కడి కెళ్లిందే మా అమ్మ?"

"ఆ కళ్లారింటి కెళ్తానన్నారు బుల్లెమ్మన్నగారుగా నుంటే రాత్రి ఎనిమిదైపోతుంది," అన్నది తల్లి

"ఊఁ - హుఁ! మామ్మ తియ్యగు చిట్టిబాబే," అన్నాడు రామ్మూర్తి నిశ్చయంగా విరక్తిగా అక్కణ్ణించి వెళ్లిపోయాడు వెనకాతలే విమలా, వాసూ వెళ్లారు, సానుభూతి చూపిస్తూ

"ఛీ, ఇంతటివాడనకోలేదు ఏదో నా సావాసం అబ్బేక బాగుపడ్డాడనుకున్నాను చివరికి నామీదనే వేశాడు కన్ను," అన్నాడు రమ్మూర్తి పరుపుమీద చతికిలపడుతూ

"కనకపు సింహాసనమున, శునకము గూర్చుండబెట్టి శుభలగ్నమునం దొనరగ పట్టముగట్టిన," అన్నాడు వాసు

"ఆహా! ఖచ్చితంగా అలాగే చేసేడు ఒక్క పిసరేనా భేదంలేదు" అన్నది విమల

"ఎన్ననుకుంటే ఏం లాభం! అతన్నింట్లోకి రానియ్యడమే తప్పు"

"ఇందాట నే నలా వెళుతున్నాను చిట్టిబాబు అల్లా మెల్లకన్ను రామిగాడికి రూపా యిస్తున్నాడు ఇవాళ మనకి దొరికిందొకళ్ళు! అన్నాడు నేన్చూశాను," అన్నాడు వాసు

"అలాంటప్పలో వొంద ఉంటాయి అందుకే మొన్న వాళ్లింట్లో పండిగ్గాను, బంగారంబిళ్లా తీసేడు" అన్నాది విమల—

"ఛీ- ఇంక అతన్ని యింట్లోకి రానియ్య కూడదు" అన్నాడు రమ్మూర్తి

ఇంతట్లో వీధిలో కేక వినపడ్డది అది చిట్టిబాబు గొంతుకని వెంటనే గుర్తుపట్టారు ముగ్గురూ

"చెప్తానుండు యేదో తేల్చుకుంటాను ఏ పెన్నో కొట్టేసి నాడబ్బు నేను గిట్టించుకుంటాను," అన్నాడు రామ్మూర్తి లేచి, దొంగతనం చెయ్యగలిగినవాడి లాగే వీధిలో కెళ్ళాడు చిట్టి నవ్వుతుంటే అతని కెలాగో ఉంది "ఏమిటోయ్?" అన్నాడు నిస్పృహతో

"పదండలా వెళ్దాం!" అన్నాడు చిట్టిబాబు

నడుస్తూ "ఇందాట మీయింటి కొచ్చాను, మీరు నిద్దరపోతున్నారు పోనీ నిద్దరపోతున్నారు ఎందుకు కదల్చడం అని వూరుకున్నాను ఇంతట్లో మీరే అటూ ఇటూ కదిలేరు రామ్మూర్తిగారూ అని పిల్చేను పలికేరు మీరు కాని కళ్లు విప్పలేదు పడుకుంటారు గావోల్సని వెళిపొచ్చేను" అన్నాడు చిట్టిబాబు

"ఆ ఎదురుగా వున్న రెండ్రూపా

(43 వ పేజీ చూడండి)




"గట్టు తెగ్గొట్టావా నీ బుఱ్ఱ తెగిపోయిం దన్నమాటే ఒరి నీ తస్సాదియ్యా ఈ వేషాల్ మా దగ్గరా? ఇదంతా మేం దండగపోవలసిందేం? పంటంతా పాడైపోవాలా? ఎవడబ్బ సొమ్మంటి? మేం గాజులు తొడిగించుకున్నామా?" అంటూ చంద్రయ్య పంచె పైకి ఎగదోస్తూ, మీదిమీదికి వస్తుంటే, చేతిలో వున్న పార క్రింద పడేసి, గట్టు దాటి, రెడ్డి మీసాలు త్రిప్పుతూ, "ఏమిటి ఊ ఎగురుతున్నావ్! మెత్తగా ఊరుకుంటున్నాననా? నెత్తురు తాగేస్తా జాగ్రత్త మరి నీరు రానివ్వేం? నీ బాబుదా? నీ యబ్బదా?" అని కోపంతో కళ్లెఱ్ఱజేస్తూ, ప్రక్కనున్న గునపం తీసుకుని నెత్తికి సూటిగా బలంగా కొట్టబోయాడు చంద్రయ్య ఆ దెబ్బ తప్పించుకొని ఉగ్రుడై "ఒరి గుడిచేటి కొడకా నీ అంతు కనుక్కుంటూరా," అని చేతికర్రతో దబదబ దెబ్బలు కొట్టేసరికి, రెడ్డి మొదట్లో గంతులు వేసినా, తరవాత స్పృహతప్పి ఒరిగిపోయాడు అప్పుడే గొడ్లను తోలుకొస్తున్న పాలేరు వెంకన్న ఇది చూసి, గుండెలు కొట్టుకొన్నా, ధైర్యంగా ప్రక్కనుంచి వళ్లి, చంద్రయ్యతో కలియబడ్డాడు అసలే అలిసిపోయివున్న చంద్రయ్య, మూలకు నెట్టవేయబడ్డాడు కముకుదెబ్బలు తగిలాయ్ ఒగుర్చుకుంటూ వూళ్లోకి పరుగెత్తాడు వెంకన్న గాయపడ్డ సూర్యుడు చేలో కూరిపోయాడు

* * * *

మనసూ మనసూ కలవాలి హృదయాలు విశాలమవ్వాలి కలుపుగోరుతనముండాలి సంతృప్తిచెందుతూవుండాలి ఎవరు పొందితే ముందని సరిపెట్టుకోవాలి అప్పుడు పేచీలకు ప్రవేశంలేదు కత్తులకు కాలుదువ్వనవసరంలేదు మీసాలు మెలివేయనవసరంలేదు బుఱ్ఱలు పగలే పగలవు దెంగలు వుండేవుండవు

పంతులుగారి ఆవును బేరంచేసినవాడు మొట్టమొదట రెడ్డి మంచి చెడ్డలు ఎలా వున్నా, పాడిలేదనే వుద్దేశ్యంతో పంతులుగారి చనువుతో, ఇంటికి తోలుకుపోయింది చంద్రయ్యే అది గాలి వీచినట్టు, తుంపరలు పడి, ఉరుములు ఉరిమినట్టు, పిడుగుపడి, తుపాన్ మహాప్రళయంలా ముందు కొచ్చినట్టు భావించాలి

అది అతి చిన్న విషయం కళ్లాడే గ్రామం పేలవంగా తయారయ్యే పరిస్థితులు ప్రారంభమయ్యాయ్ ప్రశాంత జీవితం గడుపుతున్న పల్లెప్రజలు కొట్లాటలకు, దొమ్మీలకు గురై, దినదిన ఆయుస్సులా భావించే సంఘటనలు కన్పించాయ్ గ్రామమే దగ్ధమైపోతుందా అని విజ్ఞులు ఊహించారు అంతకుముందు అంటే ఈ పొలంలో రెడ్డి చంద్రయ్యలు కొట్టుకోకముందు - పాలేరుల్ని కొద్దిగా జీతమెక్కువయిచ్చి కుదుర్చుకున్నారని, ఏవేవో ఆరోపణలు అణగివున్నాయ్ లోపల ద్వేషం ప్రబలింది బలం కూడింది కోపం హెచ్చింది ఓర్పు తగ్గింది అసూయ ప్రబలింది అంతా ఒకటనే మాత్రం మూలబడింది సమయంకోసం వేచివున్నారనిపిస్తుంది దెబ్బ ఎప్పుడు తీస్తామా అని గాలంవేసి కాసుకున్నారా అన్నట్టు కన్పిస్తుంది రెండు పుంజుల్ని ఒయటకు వదిలితే ఇక చెప్పాలా! అందులో కత్తులతో వెంట్రుకలు నిక్కబొడుస్తాయ్ కాళ్లు ఎత్తుతాయ్ దొంగచూపులు చూస్తాయ్

* * * *

ఈ దారుణవార్త వినడంతో ఆడవాళ్లు గొల్లుమన్నారు అబ్బాయిలు, అమ్మాయిలు నుక్కపెట్టారు యువకులు గుండె లదిమి పట్టుకొని, పరుగు తీశారు పౌరుషంతో ముసలమ్మలు నోర్లు నొక్కుకున్నారు తాతలు తలగుడ్డలు చుట్టారు రెడ్డితాలూకు వారంతా ఒకప్రక్క - చంద్రయ్య తాలూకు వారంతా మరోప్రక్క చేరారు దూషించేవారు కొంతమంది, కర్ర లెత్తేవారు మరికొందరు - 'శాంతం శాంతం' అని కొంతమంది, "ఎంత దారుణం" అని సానుభూతి తెల్పేవారు కొందరు ఊర్లోకి తీసుకొచ్చారు గాయపడ్డవారిని

ఆరాత్రి సోమయాజులుగారు తీర్పు చెప్పే పెద్దమనుష్యులు చుట్టలు వెలిగించి, కర్రలు ఆనుకొని, జరగబోయే విచారణ గూర్చి చెవులు జాగ్రత్తపెట్టి వున్నారు కొంతమంది యువకరక్తం పొంగేవారు బాంబులు వదులుతూనే వున్నారు జనాన్ని రెచ్చగొడుతూనే వున్నారు చంద్రయ్యదే తప్పని ఒకరు, రెడ్డి పొగరుబోతని ఒకరు, ఈ దెబ్బతో అంతు తేలాలని మరొక కుర్రకుంకంటే, ఈసారి బుర్ర రామకీర్తనలు పాడిస్తాం చావుంటే రావాలి" అని సూసాగుమాసం త్రిప్పేవారు

"నీవురావలసిందే స్నేహపూర్వకంగా వుంటే ఒకరోజు ఆగవచ్చు రెండురోజు లుండవచ్చు లేదా పై బోదినుంచి అడ్డేసి తీసుకొని తెచ్చుకోవచ్చు పాడిపంటల విషయంలో మనం అజాగ్రత్తగా వుండమంటామా? కలిసి కట్టుగా వుండాలి అయిందేదో అయింది ఇదంతా మర్చిపోవా" అన్నారు సోమయాజులుగారు ఈ బోధామృతం వారికి రుచించలేదు బట్టలు దులుపుకొని, నిట్టూర్పులు విడుస్తూ, ఇంటికి దోవతీశారంతా

"పట్టు వదలని కల్లైవారు, ఆత్మాభిమానం గల గ్రామస్థులు ఈకాలం యువకులకు తొందరతనం ఎక్కువ బాబూ" అని అనుభవజ్ఞులు శాస్త్రులుగారు కూడా అన్నారు, వున్న కిటుకును తేటపరుస్తూ

ఈ అంటువ్యాధి మాలమాదిగల గూడెంలోకి కూడా వ్యాపించింది ఒక పేటవారు చంద్రయ్యను బలపర్చితే మరొక పేట వారు రెడ్డిని చంద్రయ్య అయిదు రూపాయలు కల్లు పోయిస్తే, రెడ్డి పది రూపాయల కల్లు పోయిస్తాడు రెడ్డి రోజుకూలి రూపాయిస్తే చంద్రయ్య రూపాయన్నర దాంతో అమాయకులైన హరిజనుల్లో పేచీలు పుట్టాయ్ బండబూతులు తిట్టుకొనేవారు కుక్కల్లా కొట్లాడుకొనేవారు చీటికి మాటికి చీదరింపులు "మా దొరలే గొప్పోరు" అని ఒకరంటే "మా పబువులే మంచోరు' అని మరొకరు తీరుబడి వుంటే చాలు ఈ విషయమే పోట్లాడేవారు భోజనం చేస్తున్నప్పుడు రాత్రులు పంతెనపై కూర్చున్నప్పుడు, కలిసి కట్టుగా పొలాలకి వెళ్లేటప్పుడు పార్టీల గూర్చే అనుకొనేవారు

* * * *

ఇంతలో ఎన్నికలు వచ్చాయ్ పంచాయితీకోర్టుకు కుటుంబరావుగారిని ప్రెసిడెంట్ చెయ్యాలని వుద్దేశ్యం మొదట్లో వున్నా, ఈ పార్టీల మధ్య తాను ఇరకడం భావ్యం కాదని మౌనం వహించాడు మునసబుగారు చంద్రయ్యని బలపరిస్తే - రెడ్డిని కరణంగారు ఉషార్ చేశాగు. తెల్లవారితే ఎనికలు చాలా తీవ్రంగా వుంది పోటీ మాలపల్లెలో ఎక్కువ ఎవరికి వస్తే వారు నెగ్గుతారన్నమాట ఊర్లో సమానమే బల లో గుంపులు గుంపులుగా వచ్చి



ప్రచారం చేస్తున్నారు. ఆ రాత్రి ఆ గూడెంలో వాళ్లకు నిద్ర లేదు సరికదా ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకునివున్నారు. ఓట్లను కొనడం మొదలుపెట్టారు. ఆరాత్రి మత్తుగా పోయించివేశారు కల్లు. ఇంతలో తలకని తలంపుగా కేకలు వినిపించాయ్.

ఒక మూల ... అటు పరుగెత్తారంతా. చంద్రయ్యపాలేరు ఆకాశంలో వుండి నోరు తెంచుకుంటున్నాడు. రెడ్డిపాలేరు గిలగిలా కొట్టుకుంటూ క్రింద పడిపోయాడు. చేలోపడి ఎద్దు మేసిందట. అదీ తగువు.

అసలు అటు తోలుకొనే రాలేదు ఆ వేళ అంటాడు వాళ్ల పాలేరు. గూడెం నిద్ర నుంచి లేచిన సైనికుల్లా రాళ్లతో, కర్రలతో బాదుకున్నారు. ఆసుపత్రిలో ఆరుగురు ప్రక్కబడ్డారు. ఎన్నికల్ని వాయిదా వేశారు ఆఫీసరు.

* * *

ఇంతలో శ్రీరామనవమి వచ్చింది. చంద్రయ్యపార్టీ రాజమండ్రి భోగంవారిని తీసుకొస్తే, రెడ్డిపార్టీ పెద్దాపురం భోగం మేళాన్ని తీసుకొచ్చింది. హరికథలు గానకచేరీలు, చక్కగా ఏర్పాటుచేయబడ్డాయ్. అయిదువేల జనాభాకు రెండు పందిళ్లు. సొమ్ము నీళ్లలా ఖర్చు చేశారు. రాత్రులు ఎదురుగా ఘర్షణలు పడుతూనే వున్నారు. బొమ్మలు విలుచుకొని తిరుగుతూనే వున్నారు. దండాలు తీస్తూనే వున్నారు.

ఆఖరురోజున కళ్యాణోత్సవం ఊరేగింపులో వాహనాలు వున్నాయ్. కోయడాన్సులు, బ్యాండువాయిద్యాలు; విచిత్రవేషాలు మందుగుండు సామగ్రి జనాన్ని ఎంతో ఆకర్షిస్తున్నాయ్. ఆ రాత్రి ఎవ్వరూ నిద్రపోలే. ఆకేళి పురుషులు స్త్రీలషోజులు యిస్తూనే వున్నారు. భోగంవాళ్లను జడపట్టుకొనో, కొంగుపట్టుకొనో సరసపల్లాపాలాడుతూనే వున్నారు.

ఊరేగింపులు ఎదురుపడ్డాయ్. తారాజువ్వలు "చుయ్" న పైకి పోతున్నాయ్. చిచ్చుబుడ్లు చీదేస్తున్నాయ్ కొన్ని. ఇంతలో గగ్గోలు పుట్టింది. ఒకరి కాలును మరొకరు త్రొక్కారట. కర్రలు తిప్పారు. బూతులు తిట్టుకున్నారు. గోచీలు బిగదీశారు. పెద్ద దొమ్మీ. కసేల్ కసేల్ మని దెబ్బలు. అమ్మో బాబో అని రోదనలు. జనసమూహం చెల్లాచెదరై పోయింది. రామరాజుగారి హాస్పిటల్‌లో ఎముకలు విరిగినవార్ని గాయపడ్డవారిని చేర్పించారు. మరోకమూల సోమయాజులుగారి శవాన్ని బయటకు గొనితెచ్చారు. అంతా తెల్లబోయారు. సద్దు అణగింది. బుద్ధి గడ్డి తిందనుకున్నారు. అంతా విచిత్రంగా చెప్పుకున్నారు. పెద్దమనిషి ప్రాణాలు పోయాయ్. ఈపని చేసింది హరిజనులన్నారు. ఆ ఊరిలో వాళ్లగూడెం దగ్ధమైపోయింది. దయాదాక్షిణ్యాలు కరువయ్యాయ్.

అప్పటినుంచి ఊరు స్తిమితంగా, కల్లోలం లేకుండా వుంది. రెడ్డిగారమ్మాయినిచ్చి చంద్రయ్యకొడుక్కు పెండ్లిచేశారు. అతివైభవంగా కుటుంబరావు పంచాయతీ బోర్డు ప్రెసిడెంట్‌గా ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డాడు. గూడెంలోని పెద, సర్విగాడు ఒక్సారి ఇలా అన్నాడు. కొలువు వంతెనమీద కూర్చొని వారికేశ్రా

(18-వ పేజీ చూడండి)



సీరియల్:

పెద్దకథ:

# కుండపెంకులు

శ్రీ భమిడిపాటి రామగోపాలం

"ఇదుగో, శకుంతలా! మాట!" అన్నాను

శకుంతల వచ్చిందిగాని దగ్గరగా రాలేదు "ఎందుకు?"

"ఇంకా దగ్గరగా రావాలి"

"నే రాను"

"అదికాదు చిన్నకబురు"

"అక్కణ్ణించి చెప్పరాదా యేమిటి?"

"ఉఁహుఁ"

"అయితే పోనీ చెప్పక్కర్లేదులెండి"

"అదిగో, మరి అందుకే నాకోపం వొస్తుంది"

"ఒస్తే రానీండి బాబూ" అని నవ్వి వెనక్కి నడిచింది

కాస్త గంభీరంగా "పనుంది ఇలా వొస్తావా రావా?" అన్నాను

కొంచెం భయపడి "ఎందుకూ?" అని వచ్చింది

"నా సరదా అంతా పాడుజేశావు ఇవాళ మంచి ముఖ్యమైన న్యూస్ చెపదామనుకున్నాను నాకోపం తెప్పించి ఆ విషయంలో వున్న సౌకుమార్యాన్ని పాడుజేశావు ఇంక చెప్తే మోటుగా చెప్పాలి ఇప్పుడు చెప్పను అనక ఎప్పుడో జ్ఞాపక మొస్తుంది, అప్పుడు పిలవగానే దగ్గిర కొస్తే చెప్తాను అంతే పో"

"పోనీ చెప్పరాదా?"

"ఉఁహుఁ"

"మా అన్నయ్య ఊరికనే అన్నాడేమిటి - పిచ్చిశ్రీ అని!"

"అంటే అన్నాడులే"

శకుంతల వెళ్ళిపోయింది

శకుంతల నాకు కాబోయే భార్య మా స్నేహం తక్కువకాలంనాటిది కాదు

నా పధ్నాలుగో యేట మా వెంకటేశ్వర్లుమామ మా పల్లెటూరొచ్చి నన్ను పట్నంలో చదివిస్తేగాని వల్లగాదన్నాడు మా నాన్న నేను పల్లెటూళ్ళో తనకి కాస్త ఆసరాగా ఉంటున్నానని ఊరుకున్నా ఆగలేగు ఆనాటినించీ నేను పట్నంలో వెంకటేశ్వర్లుమామయ్య ఇంట్లోనే ఉండడం

వెంకటేశ్వర్లు మామయ్యకి ముగ్గురే పిల్లలు పెద్దది సరస్వతి తరవాత నాగభూషణం ఆనక శకుంతల మొదట్నించీ శకుంతలని నాకిచ్చి పెళ్లిచెయ్యాలని వెంకటేశ్వర్లుమామయ్య అనుకుంటున్నాడు మా అత్త దీని కెన్నడూ అడ్డుచెప్పలేదు

అందుచేత మా చిన్నతనంలో సరస్వతీ, నాగభూషణమూ మమ్మల్ని మొగుడూ పెళ్లాలంటూ ఉడికించేవాళ్లు అవన్నీ అప్పుడు సిగ్గుగా ఉంటేనప్పటికీ ఇప్పుడెంతో మధురంగా కంటకి కనిపిస్తున్నాయి. అప్పుడప్పుడు నేను "నువ్వు కాదంటేమాత్రం మానా మేమిటి? బాలవాక్యం బ్రహ్మవాక్యం చిన్నప్పుడే మనం!" అంటూంటాను శకుంతలను శకుంతలయినా, కాదనేది పైకి మాత్రమే

తరవాత మా నాన్న పోయారు మా కుటుంబాన్ని కూడా పల్లెటూళ్లో భూములు కొన్ని శిస్తుకీ కొన్ని భాగానికీ యిచ్చేసి మేం పట్నంలో కాపరం పెట్టాం కాని నేనుమాత్రం "రోజుకి ఇరవైగంటలు వాళ్ళింట్లోనే" ఉంటాను, మా అమ్మ ఉద్దేశం ప్రకారం

మా అమ్మతో ఒకటిరెండు సార్లు మా వెంకటేశ్వర్లుమామయ్య నాతో తనే కూతురు శకుంతల పెళ్లివిషయం ఎత్తిత ముభావంగా ఊరుకోవడమో లేక తరవాత చూసుకుందాంలెద్దురు అన్నగారూ అనడమో చేసేది అందుచేత నాకు హృదయాంతరాళంలో ఎక్కడో చిన్నభయం ఉంటూండేది, ఒకవేళ అమ్మ మా వివాహానికి అంగీకరించదేమో అని! ఆ భయం హృదయంలో ఒక మూలనే తన స్థానం ఏర్పరచుకొన్నా, అది ఎంతో తక్కువ పరిమాణం కలది అయినా, నన్ను కలత పెట్టేది మాత్రం చాల ఎక్కువ నవ్వుల్లో, ఏడుపుల్లో, ఎకసక్కెల్లో నేనూ శకుంతలా భార్యాభర్తలై ఒక్కచోట పెరిగాం రోజూ మాలో ప్రేమపురస్సరమైన చిరునవ్వులు నునుసిగ్గుదొంతరల్లోంచి తొంగి చూసేవి అవే గోడ అయి, మేడ అయి మాలో నమ్మకాలు కలిగించేయి, అదే నా భార్య అని నాకూ, నేనే దాని భర్తనని దానికీను అందుకనే నన్ను అది ఏమండీ అని పిలుస్తుంది అలాంటిది మా అమ్మ మా యిద్దరికి అడ్డుగా నిలిస్తే కష్టంకాదూ!

కాని ఈ భయం నాలో అట్టేకాలం నిలిచేదికాదు మా యింట్లో ఇంకా మా అందరికీ వివాహాలు కావాలి అయితే ఈ పూచీ మా నాన్న పోయినదగ్గిర్నించీ మా మామయ్యే నెత్తిన వేసుకున్నాడు అతను నాకు స్నేహితుడిలాంటివాడు నా హృదయాన్ని విప్పిచెప్తే అర్థం చేసుకోగల వ్యక్తి అతనితో చెప్పి నా వివాహాన్ని నా యిష్టప్రకారం జరిపించుకోగలనని నమ్మాను అందుచేత నాభయం కొద్దిసేపు నన్నావహించినా తరవాత తూలిపోయేది

ఉండుండి ఒకనాడు మా అమ్మ మా చెల్లెలు పెళ్లి ఊసుఎత్తగా, మెల్లగా నా పెళ్లివిషయం కూడా రాగా, మా అమ్మతో కాస్త నిష్కర్షగా నా పెళ్లిగురించి తను ఏమీ ప్రయత్నం చేయనక్కర్లేదని చెప్పాను

"అదేమిటి? అయిందా ఏమిటి అనుకున్నంత పనీ?" అంది అమ్మ కొంచెం నిర్ఘాంతపడి, కోపగిస్తున్నట్టు

"ఏమిటి?" అన్నాను నేను ఎరక్కా ఎరిగినట్టు, భయపడి

"పన్నవాసం పని! అనుకున్నానే ఏ క్లాసుపిల్లనో చూసుకుంటావని! మీ నాన్నగారే అనేవారు! ఎవర్ని చూసుకున్నావురా?"

"నువ్వనుకున్నట్టేమీ అవలేదు"

"మరి? నీ పెళ్లికి నేనేమీ ప్రయత్నించకూడదంటే ఏం మాట?"

దరలు ఇట్టే కొట్టుకుంటారు తన్నుకుంటారు మధ్యన మనం బుద్ధి లేక పేచీపడి దెబ్బలు తినడం గాని పాపం సోమోజులుగారి మాటిన్నారేట్రా. ఆయనప్రాణం పోయింది మంసికెళ్తే ఇలావచ్చిం"దన్నాడు ఆరిపోయినచుట్టను పారేస్తూ "నిజమేరా" అని, ప్రక్కనున్న పల్లిగాడు వున్నదుమ్ము దులిపి నడుం వాల్చాడు చల్లటి చంద్రుణ్ణిచూస్తూ

"ఏమీ లేదు నేను శకుంతలని తప్ప మరెవ్వర్నీ చేసుకోను అంతే"

"శకుంతలే గదా!" అంది అమ్మ నిర్భయంగా "అలాగేలే. ముందు లక్ష్మి పెళ్లి కానీ చెప్తాను"

లక్ష్మి మా పెద్ద చెల్లెలు వయస్సు పదిహేడు మూడేళ్లకిందట మా నాన్న మొదలుపెట్టాడు దానికి సంబంధాలు వెతకడం దొరకలేదు మామయ్యకూడా చూస్తున్నాడు ఇది ఒక సమస్యగా మా అమ్మనూ మామయ్యనూ బాధిస్తున్నది నాకు నిబ్బరమే ఈ యేడో వొచ్చే యేడో కొంచెం కష్టపడవలిసొచ్చినా దానికి పెళ్లవుతుందని కష్టమంటే డబ్బు విషయంలో.

* * * *

నాటి సాయంకాలం నేను భోజనం చేసి మా వెంకటేశ్వర్లు మామయ్య ఇంటికి వెళ్లాను, మా నాగభూషణం బావనూ శకుంతలనీ సినిమాకి రమ్మని బలవంతం చేశాను

తిరిగి వచ్చాక మరి ఇంటకి వెళదామన్న ఉద్దేశం నాకూ లేదు, వాళ్లుకూడా ఇప్పుడేం వెళ్తావు ఇక్కడే పడుకో అన్నారు పది గంటలప్పుడు వెళ్లడం కష్టం కాకపోయినా ఉద్దేశం ఉండబట్టి అక్కడే, డాబామీద పడుకున్నాను శకుంతల ఒంటరిగా వస్తుందా, ఒక్క నిమిషంలో నాలో ఉబుకుతున్న సంతోషవార్త చెపుదామూ అని ఉంది కాని ఎక్కడికక్కడే అడ్డు వచ్చింది భోజనానికి వాళ్లిద్దరూ కలిసే వెళ్లారు నేను కాసేపు పక్కని కూచున్నాను ఆనక పోయి డాబామీద వుంటానని చెప్పి వచ్చేశాను శకుంతల ఒక్కర్తీ ముందు భోంచేసి రాకూడదా అని ఆశించాను రాలేదు వాళ్లిద్దరూ కలిసే వొచ్చారు మరి నాగభూషణం, అత్త, ఉన్నప్పుడీ సంగతి ఎలా చెప్పేది?

పొద్దున్న మెలకువ రాలేదు వాళ్లు ముగ్గురూ లేచి వెళ్లిపోయారని చూశాను లేచి బద్ధకంగా ఒళ్లు విరుచుకుంటూంటే శకుంతల డాబా ఎక్కుతూంది

"ఓహో! అప్పుడే లేచిపోయారే! ఇంకా తెల్లవారలేదు పడుకోండి!" అంది తడిబట్ట పిట్టగోడమీద ఆరవేస్తూ

"ఇదిగో, పొద్దున్నే లేచి నీ ముఖం చూశాను ఇవా ళేమయినా అయిందా, సగం నీకిస్తాను" అన్నాను

"ఎవరన్నా డబ్బిస్తేనో?"

"అది తప్ప! అవునుగాని ఇలా రా ఒకమాటు! నిన్న నేమన్నానో జ్ఞాపకం చేసుకో!"

శకుంతల కొద్దిగా నవ్వింది "అబ్బ! ఎంత గడుసువారండీ! రమ్మనగానే వొచ్చేయ్యాలీ!" అంటూ దగ్గిరికొచ్చి "ఇదుగో-ఇంతకన్న దగ్గిరికి రాను ఏమిటి?" అంది

నటుక్కున చెయ్యి అంగుకుని "నీకో మధురమైన సంగతి చెప్పనా?" అన్నాను

"ఇదుగో - మరి చెయ్యి వొదలండి లేకపోతే అంతకంటె చేదైన సంగతి జరుగుతుంది"

"చెయ్యి వొదిలితే రసమే లేదు నిన్న మా అమ్మని మనిద్దరి పెళ్లిసంగతీ అడిగాను మా చెల్లి పెళ్లి అయిపోగానే ఈ సంగతి చూద్దామంది"

"ఎప్పుడూ ఇదే గొడవ ఇంతేనా?" అని చెయ్యి విడిపించుకున్నది

"అయ్యేవరకూ ఆ గొడవే ఉండాలి" అనివ్వాను

"మరి పళ్లు తోముకోడమూ కాఫీ తాగడం ఇవేవీ అక్కర్లే దన్నమాట!"

"తాగడానికి నువ్వింకొహటిస్తే కాఫీ కాదు అమృతం కూడా అక్కర్లేదు" అన్నాను కించిత్తు సార్థకంగా నవ్వి

"అదిస్తే అమ్మ కర్రుచ్చుకుంటుంది అని చరచరా వెళ్ళిపోయింది శకుంతల అటు వేపు చూస్తూ తృప్తిగా కూచున్నాను వెనకాలే వెళ్దామా అన్నంత ఉబుకు మొదట్లో పుట్టింది కాని ఇద్దరమూ ఒకరి వెనకాల మరొకరు వెళ్తే ఏదో అనుకుంటారు చూసినవాళ్లు సిగ్గుపడి ఉండిపోయాను

ఆనక లేచి కిందకి వెళ్లి కాలకృత్యాలు తీర్చుకుని కాఫీ త్రాగి మాయింటికి వెళ్లిపోయాను

* * *

"నువ్వే పాడుజేశావోయి ఆట!" అంది అత్త

"నేనేం పాడు జెయ్యలేదు శకుంతల చేతులో ఆసూ రాణీ ఉన్నాయి మరి నావి రాజూ జాకీన్ని రెండుపట్లూ యిచ్చుకోవలిసింది" అన్నాను.

"పిచ్చిశ్రీ గారు - అర్థంచేసుకోలేకపోయారు మీ రేది వేసినా నేను ఆసు వయ్యదల్చుకున్నాను మా అన్నయ్య చేతి గోది తురఫు ముక్కనుకున్నాను" అంది శకుంతల

"అన్నీ బాగున్నాయిగాని ఆ ముక్కేమిటి?" అంది అత్త

"ఏదీ?" అంది శకుంతల

"అతన్ని ఆలా పిలవడమేమిటీ అని!"

"పిచ్చిశ్రీ అని!" అన్నాడు నాగభూషణం నవ్వి

"సరదాకి!" అని సిగ్గులో నవ్వింది శకుంతల

"ఆఁ, సరదాకి! మనిషి విలవెంతో గుర్తించక్కర్లా? ఏదో వాడన్నాడనీ, అంటే అత నూరుకున్నాడు గదా అనీ నువ్వూ అనెయ్యడమేమిటి? - అయినా నీకు మరీ మితిమీరిపోతోంది రా అబ్బాయ్!" అంది అత్త జోరుగా

నాగభూషణం ముక్కలు కలుపుతున్నాడు

"నాది కాబోల్లా ఆట!" అంది అత్త

ఇంతలో తలుపుతట్టి పిలిచా రెవరో

టెలిగ్రాము కమల - సిక్ - ఎరైవింగ్ - ఈవినింగ్ - వంకటేశ్వర్లు

కమల మా నాగభూషణం పెళ్ళాం పుట్టింటికి పోయింది మా వెంకటేశ్వర్లు మామ పనిమీద అటువేపు వెళ్ళి ఓమాటు ఆ వూరుకూడా వెళ్తానని చెప్పాడు

"అంటే?" అంది అత్త

"దానికి జబ్బుగా వుందిట సాయంకాలానికి వొచ్చేస్తున్నామని రాశారు" అన్నాడు నాగభూషణం

"ఏం జబ్బు ట్మా?" అంది అత్త బెంగగా

"ఏమో ఏం జబ్బో!" అన్నాడు నాగభూషణం దిగులుగా "ఎరైవింగ్ అంటే ఆయ నొక్కరూనా లేక ఇద్దరూనా?" అన్నాడు మళ్ళీ

"ఇద్దరూనే ఒక్కరూ అయితే టెలిగ్రా మెందుకూ? ఎప్పుడొచ్చినా రావొచ్చు" అన్నాను

"జబ్బుతో వున్నదాన్ని తీసుకురావడం ఏమంత మంచిపనని?"

"ఏమో నాయనా, ఆయనసంగతి ఎవ్వరూ మాట్లాడలేరు" అంది అత్త

అలా అని తిన్నగా వంటింట్లోకి వెళ్లింది వెనకాలే శకుంతల వెళ్లింది నాగభూషణం నేనూ కూర్చున్నాం కాని ఓ నిమిషం తలపట్టుకుని లేచి వెళ్లిపోయాడు

నేను వెళ్లిపోదామా అని ఆలోచిస్తున్నాను కాని ఆ విధమైన ఉత్తరం రాగానే వాళ్లని వొదిలి వెళ్లిపోవడం మంచిది కాదని తోచింది కూచుండిపోయాను

రెండుమూడు నిమిషాలు గడిచాక కాఫీ పట్టుకుని శకుంతల వచ్చింది

"వచ్చాంరా భగవంతుడా! మీకూ విచారంగా వుందీ?" అంది నవ్వుతూ

నేనూ నవ్వి "విచారంకాదుగాని మీ అన్నయ్య ఏం జేస్తున్నాడు?" అన్నాను

"ఉహూ బెంగెట్టుకుని తలపట్టుకు కూచున్నాడు ఫరవాలేదురా అంటే వినడు ఇంకా ఏం జబ్బో, ఎంతముట్టుకో తెలీకుండానే ఏడుపు! టెలిగ్రామిచ్చేటంత వరకూ వొస్తే యింకే మనుకోవడం అంటాడు కాఫీ తాగండి చల్లారిపోగలదు!"

"మీ అన్న కాఫీ తాగాడా?"

"తాగకు ఎం సయించలేదంటూనే గళాసుడూ కొట్టేశాడు" అని నవ్వి వెళ్లిపోయింది

ఈలోగా నేను కాఫీ కొంచెం రుచి చూసి "పంచదార చాలలేదు" అన్నాను

"తెస్తా"

తెచ్చిన తరవాత శకుంతలమీద నా స్వేచ్ఛను ఇంకొంచెం పోనిద్దా మనిపించింది ఇందుకు ఒదినగారి జబ్బువార్త దానిలో వాతావరణపు మార్పు కలిగించదా అనే సందేహం మొదట పుట్టింది కాని వాళ్లన్నయ్య ఏడుస్తోంటే నవ్వేంది, అందుచేత మార్పు లేదని తెలియలేదా అనిపించింది

"మా యిల్లూ, మా కాఫీ అన్నీ మీకు తీపి తక్కువ! ఏంజేస్తాం? మా ఖర్మ!" అంది శకుంతల వొస్తూనే

"అదికాదు సంగతి నీ చేతినుంచి ఎంత వీలయితే అంత తీపి తాగేద్దామని!"

చెమ్చాతో తెచ్చిన పంచదార గ్లాసులో వేసి టకటక లాడిస్తోంది ఈజీ చైరులో నడుం వాల్చి ఉన్నాను నేను బల్లమీద కాఫీవుంది వొంగి కలుపుతోంది నేను సరిగా కూచుంటే దాని బుగ్గ అందుతుంది

కాని ధైర్యంలేక వంగలేదు వంటింట్లోంచి వాళ్లిద్దర్లో ఎవరన్నా వొస్తే, అని చెయ్యిజాచి దాని చెయ్యి తప్పించి గ్లాసు పుచ్చుకున్నాను అది వనక్కి లేవగానే నేను ముందుకు వంగాను మాట్లాడకుండానే వెళ్ళిపోయింది దాని చెయ్యి నేను ముట్టుకున్నందుకు ఎలాంటిచూపు చూసిందో నేను చూడలేదు

మరో పది నిమిషాలు గడిచాక నాగభూషణం దిగులుగా వొచ్చి "స్టేషనుకెళ్దాం వొస్తావురా?" అన్నాడు

"నువ్వలా దిగులుగావుంటే రాను"

"అంటే?"

"ఛియర్ ఫుల్ గా ఉండాలి"

"ఛ్ఛ ఏమిటోరా నా మనస్సంతా కలత పడ్డది"

"అవును ఏం మునిగిందనిరా?"

"నీకు తెలీదురా! దాని వొళ్లు మంచిది గాదు చాలా వీక్ గా వుంటుంది ఏది వొచ్చినా కొంప మునిగినంత అవుతుంది ఆ వేళ నువ్వు లేవూ, మా అమ్మ నాలుగు చీవాట్లు పెట్టేసరికి ఫీవరొచ్చి ఎంతో యిదయింది!" అన్నాడు బెంగగా

"అయితే అస్తమాటూ అలా అవుతుందనా? బావుందిరా! పైగా నువ్వు బెంగపడితే అది ఎక్కువౌతుంది ధైర్యమే ఔషధం"

"టెలిగ్రాంకూడా యిచ్చేశారు ఈయన ఎంత సీరియస్సో యేమిటో!"

"టెలిగ్రామిస్తే సీరియస్సనుకోవాలేమిటి? ఇక్కడ ఎరేంజిమెంట్సూ అవీ చూసుకుందుకి టెలిగ్రామిచ్చేరని నా ఉద్దేశం"

"ఎరేంజిమెంట్సంటే?"

"డాక్టరూ అదీను!"

"మీ మామయ్య అంత చిన్న సంగతికి టెలిగ్రామివ్వర్రా బాబూ ఏదో సీరియస్సే అయివుంటుంది"

"అయితే నడు అంత భయపడితే యింకెలాగరా? కాస్తన్నా ధైర్యంలేదు గోరంత చూసి కొండంత అనుకోవడం!"

స్టేషనుకి వెళ్తూ దారిలో వాళ్ల డాక్టరుకి ఈ సంగతి చెప్పి ఆరుగంటలు కొట్టేసరికల్లా యింటికి రమ్మని చెప్పాం

* * * *

కమలకి అంతజబ్బులేదు పట్నంలో కాస్త డాక్టరు సదుపాయం ఉంటుందిగదా అని వెంకటేశ్వర్లు మామయ్య తీసుకొచ్చేశాడు కమలతో వాళ్లమ్మ, అన్న, వచ్చారు

వచ్చిన పదిరోజుల్లో పరవాలేదని అనిపించింది కాని తరవాత మళ్ళా ఎక్కువ కావడం ప్రారంభించింది ఇంట్లో వాళ్ళ బెంగలు మరీ ఎక్కువయినయి

ఉన్న విషయం ఏమిటంటే నాగభూషణం సంగతి అటుంచగా ఒక్క వెంకటేశ్వర్లు మామయ్యా శకుంతలా తప్ప మిగతా వాళ్లందరూ బెంగబెంగ! ఏం దారి నాకు అంటుందా తల్లి ఆవిడ సంతానంలో కమల గారాబు బిడ్డ

ఒక నెల గడిచే సరికి కమలస్థితి నేను బెదిరించినట్లే చాలా నీరసం అయింది డాక్టరు చెప్పడానికి భయపడుతున్నాడని నేను తెలుసుకున్నాను ఆనక ఒకనాడు నాతో వేరేగా "ఆకేసు ఫేలయే అవకాశాలే ఎక్కువండీ" అన్నాడు

కమల జబ్బూ ఆ బెంగా అలా ఉండగా ఈలోగా నాగభూషణం అత్తగారూ బావమరిదీ నాలో కొన్ని కొత్త చిరాకులు ప్రవేశపెట్టారు వయస్సున్న మగవాణ్ణి నేను అస్తమాటూ వెంకటేశ్వర్లు మామయ్య ఇంట్లోనే ఉండడం వాళ్లలో ఏమిటో అనుమానం కలిగించింది మా కిద్దరికీ పెళ్లవుతుంది గనక వీట్న నేను లెక్క చెయ్యవలసిన అవసరంలేదు కాని అనవసరంగా వాళ్ల తీక్ష్ణవీక్షణాల్ని అందుకోడం ఇష్టంలేక వాళ్లింటికి అంత తరుచుగా వెళ్లడం మానుకున్నాను చివరికి కమల చచ్చిపోడం నేను చూడకుండానే జరిగింది చచ్చిపోయిందంటే ఆక్షణాన ఏమాత్రమో ఆశ్చర్యం చూపించాను గాని తరవాత ఇంతకే నకు తెలిసిందేగదా, అను

కున్నాను కాని కమల చచ్చిపోతుందని నాకు తెలుసు సుమండీ అని వాళ్లతో చెప్పలేకపోయాను

* * *

కమల పోయిననాడు వెళ్లాను, మళ్లా నెలరోజులవరకూ వెంకటేశ్వర్లు మామయ్య ఇంటికి వెళ్లడం మానుకున్నాను వాళ్ల విచారాల్లో వాళ్లుంటే నేను కేవలం శకుంతలకోసం వాళ్లింటికి వెళ్లడం తప్పుగా కనిపించింది పరామర్శకి మావాళ్లందరూ కమలపోయిన పదహారోరోజున వెళ్లారు అప్పటికి కమల తల్లీ అన్నగారూ లేరట

పూర్తిగా నెలరోజులు గడిచాక ఒకనాడు నేను వెంకటేశ్వర్లు మామయ్య ఇంటికి వెళ్లాను ఇంట్లో అంతా దిగులుగా నిశ్శబ్దంగా ఉంటారనుకున్నాను కాని అంతలా ఏంలేదు నాగభూషణం ఇంట్లో లేడు మామయ్య ఊళ్లో లేడు

"ఏమయ్యా రావడం మానేశావ్?" అంది అత్త

"ఏం లేదండీ - మీరు విచారంగా వుంటున్నప్పుడు నేనొస్తే అది మరింత ఎక్కువవుతుందిగాని తగ్గదుగదా, అంచేత రావడం మానుకుంటే మంచిదనుకున్నాను"

"అయ్యో!" అంది ఆవిడ నవ్వి

"నిజం! నేనలాగే అనుకున్నాను"

"పోన్లే ఒంట్లో ఏం చిక్కగా లేదు కద!"

"లేదండి నాకసలెప్పుడూ ఏ జబ్బూ రాదు"

"పోనీ, మా పిల్ల సుఖపడుతుంది" అని నెమ్మదిగా అనుకుందావిడ

"భూషణం ఏడీ?"

"శకుంతల నడిగినట్టున్నావు! వాడికేం కూసుపోలేదుట అలా తిరిగొస్తానని పోయాడు మీ మామయ్య సిస్తులు వసూలు చెయ్యడానికి వెళ్లారు"

"భూషణం ఎంతసేపట్లో వొస్తాడో"

"కూచో వాడూ అట్టే తిరిగే రకం గాదు ఇకనో ఇప్పుడో వొచ్చేస్తాడు"

లేచాను సావిట్లోకి పోయాను కుర్చీ దగ్గర్లో కూచుని పక్కని స్టూల్ మీద వున్న ఒక పత్రిక తిరగవేస్తున్నాను చెనకాల గాజుల చప్పుడయ్యేవరకూ తిరగవేశాను అప్పుడు చూశాను

శకుంతల కాఫీ తెచ్చింది

"ఇదేమిటి?"

"కనపడ్డంలేదూ, కాఫీ!"

"మీకు వేళాపాళా తెలీదులా వుందే! సాయంకాలం అసలు సంధ్యవేళ కాఫీ యేమిటి?"

"అది అసలు సంధ్య కాదనీ అసుర సంధ్యనీ కదండీ తమ రిదివరకు చెప్పారు!"

"పోన్లే కాని ఇప్పుడు కాఫీయిస్తే ఏమనుకోడం!"

"ఆహా! ఏమి నా భాగ్యము! అనుకోనిత గాలి!"

"ఏం భాగ్యం!" అని వెటకారంగా చెప్పి కాఫీ తీసుకున్నాను

"పంచదార సరిపోయిందీ?"

"నీ చేతుల్లోంచి వొచ్చింది ఎప్పుడూ తియ్యగానే ఉంటుంది" అన్నాను గ్లాసు కింద పెడుతూ

"ఈ కవిత్వం ఎన్నాళ్లబట్టి?"

నేను జవాబు చెప్పలేదు మౌనంగా కాసేపు గడిపాం

"ఇంకేమిటి విశేషాలు?" అన్నాను

"ఉండండి"

లోపలికి వెళ్లి ఒక కార్డు పట్టుకొచ్చింది

శ్రీ బావగారికి,

మీరు రావడం మానుకొని నెలఅయింది కారణం తెలియదు మీరు ఊళ్లో లేరేమో అనుకోవలసి వస్తోంది ఊళ్లోవుంటే వస్తారని తెలుసు మాకేమీ తోచడంలేదు ఫీజులు కట్టుకుందికి మనసు రాదు అమ్మ ఎంతసేపూ ఏదోపని కల్పించుకుంటో మాటాడకుండా ఉంటోంది అన్నయ్య దిగులుగా మాట్లాడకుండా పడుకుంటాడు నాకు అల్లిక ఒక్కటే పని బాగులేదు నాన్న వారానికోసారి ఇంటిముఖం చూస్తారు మీరు ఊళ్లోవుంటే ఒకసారి తప్పకుండా రండి మీ శకుంతల"

"ఏమిటిదీ?"

"ఉత్తరం"

"అవును—మొన్నటి దేటుంది, పోస్టు చెయ్యలేదేమా అని!"

"వెళ్లడానికెవరూ లేక, పైగా ప్రతీ నిమిషంలోనూ మీరు ఊళ్లో వుంటారో ఉండరో అని భయంకొద్దీను"

"బాగుంది ఊళ్లో వుండకేపోతాను? - అయితే ఈ నిర్జీవ వాతావరణం అంతా నేననుకున్నట్టే పెరిగిందన్నమాట!"

"అంటే?"

"నేను రోజూ వొద్దామా అనుకుంటూ మళ్లా విచారంలో కుంగి కృశించిన మీరు ఎవరూ నాతో మాట్లాడ్డానికి తగిన ఓపికతో వుంటారనుకోలేదు"

ఓపిక వుంది ఉద్దేశమూ వుంది మరొస్తే ఏమిట్లో అందరికీ సరదాగా వుంటుంది"

"ఓస్!"

"ఓస్ కాదు ఆ పేకాటలో, ఈ హాస్యమాడడమో ఏదో సరదాగా పొద్దుపోతుంది పోనీ చూడండి, పేకదస్తా ఆ వాచీ స్టేండు మీద వుందా, రోజుకో యిరవైసార్లు నేను తప్ప మరెవ్వరూ దాన్ని చూడలేదు"

"మూల్లేదంటే తప్పా? మీ అన్నయ్య సంగతి నీకు తెలీదూ? ప్రతిదానికీ ఏడవవలసినదానికి వెయ్యిరెట్లెక్కువ యేడుస్తాడు నిజమేనా?"

"నిజమే"

"మరి అలాంటివాడు పేకవేపు చూస్తాడని చెప్పుకోడం దేనికి? - ఇదుగో యిలాంటి వొచ్చి నేనుకూడా మీకు ఏమాత్రం ఉపకారం చెయ్యలేనేమో అని భయపడి రావడం మానేశాను లేకపోతే మీ యిల్లు నాకేం చేదు గాదు నా బ్రతుకులో జ్ఞానం వొచ్చిన తరవాత ఎక్కువ కాలం ఇక్కడే వున్నాను"

నాగభూషణం తలుపు కొట్టాడు "అమ్మా!"

"అదుగో అన్నయ్యొచ్చేడు" అని శకుంతల వెళ్లి తలుపు తీసింది నాగభూషణం వచ్చాడు వాడి మొహంలో విచారం ఛాయలు అట్టే మునుపు ఉన్నకంటె ఎక్కువగా కనపడలేదు

"ఏంరా, ఎక్కడా కనపడ్డం మానేశావ్!" అన్నాడు

వాడి విచారం సంగతి జ్ఞాపకం చెయ్యడం బాగా తోచక "ఏం లేదురా!" అనేశాను

"ఊళ్లో వున్నావా?"

"ఊళ్లోనే వున్నాను"

శకుంతల వెళ్లిపోయింది

"జీవితంలో కష్టాలు ఇప్పట్నించే ఆరంభమౌతా యనుకోలేదురా!" అన్నాడు నాగభూషణం కొద్దిసేపు గడిచాక, కూచుని

"ఏమో కష్టాలకి ఆరంభమూ అంతమూ ఉంటాయని నా ఉద్దేశం కాదు ఎప్పటి కప్పుడే ఆరంభం ఎప్పటికప్పుడే అంతూ!"

"నాకు తెలిసినంతమట్టుకు నాది బహు సున్నితమైన మనస్సురా అతి చిన్న విషయానికి కూడా పెద్ద ఆరాటం పొందుతాను ఈ నెల్లాళ్లూ ఎలా గడిపేనో ఆ భగవంతుడి కెరుక!"

"విన్నాను శకుంతల చెప్పింది కాని ఈ మారెప్పుడూ అలా అడ్డమైన వేళలా పడుకోకురా భాయ్ ఫీవరొస్తుంది పైగా అజీర్ణం అవీ వొస్తాయి"

"ఏడిశాయి నాకేం రాలేదు"

"రాకపోతే మా లింగమూర్తిలా అదే అలవాటయిపోతుంది అతను చూసేవు కదూ, పడుకుంటే గాని ఉండలేడు!"

"అతనా? అవును" చిన్న నవ్వు ఇప్పటికి చూశాను

"పైగా బహు మర్యాదగా 'ఐ లవ్ ఈక్' అంటాడు!" అన్నాను నవ్వు కొంచెం పెద్దది చేసి

"మనస్సంతా చెడిపోయిందిరా ఎక్కడా రిక్రియేషను కూడా లేదు పోనీ నువ్వుంటే కొంత ఏదో పూసుపత్తేది" అన్నాడు మళ్లా నిర్వేదంతో

"నే నేమి టనుకున్నానంటే నువ్వీ విచారంలో ఉండిపోయి నే నొచ్చినా ఏం లాభం ఉండదనుకున్నాను"

లేదన్నట్టు తల వూపాడు

"కాసేపు బ్రిడ్జి వేసుకుందాం వొస్తావా?" అన్నాను

"చీకటి"

"డాబామీదికి పోదాం"

"పద నేనెళ్లి కొంచెం మంచి నీళ్లు తాగి వొస్తాను"

* * * *

'నే నిక్కడుంటె ఏమమ్మా?' అన్నాను మా అమ్మతో

'ఏమని మళ్ళా అడుగుతాడూ! నువ్వు రావాలిరా! అంతే'

'నేను రాకపోతే ఏమి?'

'ఒరే బాబూ, మాట అనెయ్యగానే సరికాదు కొంచెం ఆలోచన వుండాలి'

'ఆలోచించే అంటున్నాను నాకక్కడేం బాగుండదు ఒట్టి పల్లెటూళ్ళో ఏం వూసుపోతుంది? ఇక్కడైతే '

'వాళ్ళింటికీ వీళ్ళింటికీ తిరుగుతూండొచ్చు అంతేనా?'

'పోన్లేవమ్మా నువ్వెప్పుడూ యింతే'

'అవును, చెప్తూంటే నీకు కొంచెం కూడా సిగ్గు లేదేమి? ఎవరేమనుకుంటారో అన్న భయం లేదేం? ఇదుగో ఆఖరుమాట నువ్వు మాతో రావలసిందే ఇక్కడుండడానికి వీల్లేదు'

దీంతో అమ్మమాటలు నాకు అర్థమయ్యాయి మరి నేనేమీ అనలేదు సాయంకాలం వేళ వెంకటేశ్వర్లు మామయ్య ఇంటికి వెళ్లాను

'మేమందరం కలిసి మామామయ్యగారింటికి వెళుతున్నాం మళ్లా రెండు నెల్లకిగాని రాకపోవచ్చు' అన్నాను సావిట్లో కూచున్న నాగభూషణంతో

'దేనికి?'

'మామయ్య రమ్మని ఉత్తరం రాశాడు మా చెల్లికి సంబంధం చూస్తానని చెప్పాడు ఎవరెవరో అడుగుతున్నారట ఇంటయ్యక్కి కూడా దూరమనీ వ్యవహారం కొంచెం కష్టంగాఉందనీ రాశాడు పైగా ఇక్కడుండీ చేసే పనిలేదుగా! పోతున్నాం'

'నువ్వూ వెళుతున్నావా?'

'మరి అన్నమాటేగదూ అర్థం!'

'నిన్న నాతో మాటాడుతూ బ్రహ్మరుద్రులొచ్చినా యిక్కణ్ణించి కదలనన్నావ్?'

'ఏం చెయ్యను మరి? మా అమ్మ ఇలాంటిదని తెలియలేదు'

ఆ వేళ శకుంతలను ఒంటరిగా కలుసుకొనే అవకాశం కలుగుతుందనిపించలేదు మర్నాటి ఉదయం ఎనిమిది లోపునే ప్రయాణం దాంతో చెప్పకుండా పోవడం కష్టంగా తోచింది

చివరికి వెళ్లిపోయే ముందు పోనీ ఓసారి ప్రయత్నిద్దామని పెరట్లోకి వెళ్లాను బిందెలోకి నీళ్లు తోడుతూంది శకుంతల

"ఇవాళ నీతో ఓ పెద్ద విషాదవార్త చెప్తున్నాను" అన్నాను

'ఏమిటండోయ్?'

'నేను మా మేనమామగారింటికి వెళ్తున్నాను మళ్లా రెండు నెల్లకి గాని రాకపోవచ్చు'

'ఇంతేనా?'

'హుఁ నీకలా అనిపిస్తోంది గాని నన్నర్థంచేసుకో గలిగితే ఎంత బాగుణ్ణు! నేను వెళ్లలేక వెళ్లలేక వెళుతున్నాను తెలుసా?

"అంత బలవంతంమీద వెళ్లకపోతే ఏమండీ?"

"మా అమ్మొప్పుకోదు నే నొక్కణ్ణే యిక్కడుంటానే అంటే నీకేమన్నా సిగ్గు లేదేమంది"

'అవును మీకు నిజంగానే సిగ్గులేదు' అంది నవ్వుతూ

'పోన్లే ఏం చేస్తాం మగాణ్ణి నాకు సిగ్గక్కర్లేదు కాని నీకు ఒక్క పిసరన్నా నామీద సానుభూతి లేకపోవడం నాకు కష్టంగా వుంది'

'ఇంకా ఏమేమున్నాయి?' అంది ఇంకా నవ్వుతూనే

'నీకంత నవ్వులాటగా వుందిగనక ఒంట్లో మా గొప్ప మంటగా వుంది

ఈ మాట అనేసరికి నీళ్లబిందె బుజానికెత్తుకుని 'అయితే పోసెయ్యనా?' అంది

నేను నవ్వాను 'ఇంటి కెళ్ళడానికి ఓ పంట్లామూ షర్టూ ఇవ్వగలిగితే పోసెయ్' అన్నాను

'ఆఁ, పాపం! మీ కోసమనుకున్నారేమిటి కష్టపడి తోడింది! అరిటిచెట్టుకి మీరు తోడుతానంటే పోసేస్తాను'

అలా అంటూనే అరిటిచెట్టుదగ్గిరికి పోయి నీళ్ళుపోసి మళ్లా వొచ్చి నిశ్శబ్దంగా నీళ్లు తోడుతోంది

'ఇదుగో శకుంతలా, ఓ సంగతి చెప్తాను కాస్త దానికి ఇటూ అటూ ఉన్నవి చెప్తావా?'

'ఏమిటది?'

'సీరియస్‌గా మాట్లాడుతున్నాను నువ్వేమన్నా విట్టు చేశావంటే ఒళ్లు మండి ఇక్కణ్ణించి పోవలిసొస్తుంది'

శకుంతల మాట్లాడలేదు

'నాకో పెద్ద భయంవుంది ఈ రెండు నెలల్లోనీ మీ నాన్ననీ అమ్మనీ మభ్యపెట్టి ఎవరన్నా నిన్ను మాట్లాడుకుంటారేమో అని!-దీని సంగతి కాస్త చెప్పూ?'

'అంత భయమైతే యింకెలాగ?'

'అది కాదు ప్రశ్న ఒకవేళ అలాంటిదేమైనా రాగలదా అని!'

'అలాంటిదేమైనా అయినప్పుడు మీ రిక్కడుంటేమాత్రం ఏమయినా చెయ్యగలరా?'

'—నువ్వు సరిగ్గా నా సంగతంతా తెలుసుకున్నావు గాబట్టి నా వీక్ సెస్ కూడా గుర్తించావు నాకిందుకు తృప్తిగా వుంది నువ్వు నా స్నేహితుల్లో బెస్టు కాని అలాటిదేమైనా అయితే నే నిక్కడుండగా జరిగేదానికీ లేకపోతే జరిగేదానికీ భేదం ఉంది నే నిక్కడుండగా జరిగితే ప్రతీ నిమిషంలోనూ పోరాడి ఓడిపోయో, లేక మరో విధంగానో నువ్వు నాకు లేకుండా పోయే నష్టాన్ని చివరివరకూ, చివర్కి సమర్థించుకోగలను కాని నేను అక్కడుండగా జరిగితే అంతా, నువ్వనే పదార్థం అంతా

(28-వ పేజీ చూడండి)

# సినిమాశిల్పం: జాతీయత



సినిమా కళ మనకు ఇతర దేశాల నుండి దిగుమతి అయిన సంగతి అందరికీ తెలిసిన విషయమే. అది మన కళా సాధనం కాదు. ఈనాడు కూడా మన జాతీయ సినిమా పరిశ్రమ యావత్తూ ఎన్నో దిగుమతి వస్తువులపై ఆధారపడివున్నది. స్టూడియోలో ఉండే కామెరాలూ, వెన్నులూ, రికార్డింగ్ యంత్రాలూ, లైట్లూ, మైకులూ, మూవియోలాలూ, ప్రొజెక్టర్లూ, ముడి ఫిలిమూ, చిత్రనిర్మాతలు తప్పనిసరిగా ఉపయోగించె మోటార్లూ, వ్యాన్లూ, పెట్రోలూ, సినిమా ప్రచారానికి కావలసిన కాగితాలూ, రంగులూ, అచ్చుయంత్రాలూ, స్టిల్ కామెరాలూ, ప్రోసెస్ ప్లేట్లూ, రసాయనాలూ—ఒక్కటేమిటి? కర్రసామగ్రీ, తడికలూ, మట్టీ మొదలైనవి కొద్దిగా మినహాయిస్తే సమస్తమూ దిగుమతి సరుకే, దిగుమతి సుంకాలిచ్చుకునేదే.

ఇన్ని రకాల దిగుమతి సరుకులతో తయారయే భారతీయ చిత్రాలలోని శిల్పం విజాతీయ వాసనలు కలిగి ఉండటంలో ఆశ్చర్యపడవలసిన పనిలేదు. అయినప్పటికీ మన దేశంలో ఫాల్కే మూవీ చిత్రాలు తీయడం ప్రారంభించినప్పుడే ఒక జాతీయ సినిమా శిల్పం అమలులోకి వచ్చింది. అయితే అప్పట్లో కామెరా కేవలం సాక్షీభూతంగా ఉండేది కనక చెప్పుకోతగిన సినిమాశిల్పం లేదనవచ్చును. అయినా ఉన్నంతలోనే ఆకాశంలో నారదుణ్ణి చూపటానికీ, సముద్రంలో శేషశాయిని చూపటానికీ, ఓవర్ ప్రింటింగ్ పద్ధతి వినియోగించబడింది. మల్టిపిల్ ప్రిజంతో ఒక రాక్షసుడు అనేకమంది రాక్షసులైనట్టు చూపటం జరిగింది. సాధనాలన్నీ విదేశీ సరుకే అయినప్పటికీ, అప్పట్లో తీసిన పురాణ చిత్రాలకు ఉపకరించే జాతీయ భావాలు చాలావరకు సినిమా తెరమీదకు తీసుకురాబడ్డాయి. ఇవన్నీ అంతకుపూర్వం రంగస్థలాన చేసిన ప్రయోగాలు కాకపోవటం చేత సరికొత్త సృష్టికూడా అయినాయి. ఆ కాలంలో "శ్రీకృష్ణలీల" చిత్రంలో నీటి అడుగున కృష్ణుడికీ కాళీయుడికీ జరిగినట్టు చూపబడిన పోరాటమూ, 'లంకాదహనం' చిత్రంలో హనుమంతుడి పాత్రా, ఆ హనుమంతుడు అంతలో చిన్నవాడూ, పెద్దవాడూ కావటమూ మొదలైన దృశ్యాలు ఆనాటి అమాయక ప్రేక్షకులకు ఊహించలేనంత అద్భుతంగానూ అపూర్వంగానూ గోచరించాయి. అంతకుపూర్వం వారు ఈ పురాణకథలను విన్నా, నాటకరంగాన చూసినా కూడా కలగని ఆనందం ఫాల్కేగారి చిత్రాల ద్వారా ప్రేక్షకులకు లభించింది. ఆ రోజులలోని సినిమా శిల్పం విజాతీయ వాసనలను కలిగి ఉన్నట్టు ఆనాటి ప్రేక్షకులు భావించనే లేదు.

ఆనాడవి పురాణ చిత్రాలు, యావద్భారత చిత్రాలు కూడానూ. ఈనాడు పురాణచిత్రాలు తీసే తేవు, మీదుమిక్కిలి తెలుగువారికి తెలుగుచిత్రాలూ, తమిళులకు తమిళచిత్రాలూ ఉన్నాయి. ఈనాడు మనం తయారుచేసుకునేవి ముఖ్యంగా జానపద చిత్రాలూ, సాంఘిక చిత్రాలూనూ. ఈ జానపద చిత్రాలు మన ప్రజల అభిరుచులకు చాలా సన్నిహితంగా ఉన్నవనీ, సాంఘికచిత్రాలు ప్రజా జీవితానికి సన్నిహితంగా ఉన్నవనీ, ఈ రెండువిధాలా ఇవి పురాణ చిత్రాలకంటె ప్రజలకు సన్నిహితమైనవనీ వాదించే అవకాశం ఉన్నది.

కాని మన సినిమా శిల్పం చూసినట్టయితే ఫాల్కేగారి నాటికి అందులో ఉండిన జాతీయతలో ఈనాడు నూరో వంతు లేదనిపిస్తుంది. ఈ జానపద చిత్రాలు మన పాత సంప్రదాయాలను గాని, సాంఘికచిత్రాలు ప్రస్తుతాచారాలను గాని ప్రతిబింబించవు. జానపద చిత్రాలలో కనీసం మన పూర్వకాలపు శిల్పాలైనా కనపడవు, చరిత్ర స్ఫురించదు. సాంఘిక చిత్రాలలో అధమం ఒక తెలుగువాడి ఇల్లయినా కంటపడదు. అన్నిటికంటె ఘోరమేమిటంటే జానపద చిత్రాలకూ, సాంఘిక చిత్రాలకూ కూడా మాతృకలు దిగుమతి సరుకే!

ఈ కాలంలో శిల్పంలో చాలా గొప్ప పరిణామాలు జరిగినమాట నిజమే. ఈ పరిణామంతోబాటు ప్రజాసామాన్యంలో సినిమాలపై ఆదరణ అనేక రెట్లు పెరిగినమాటా నిజమే. కాని సినిమా శిల్పంలో జరిగిన పరిణామం జాతీయతనూ, జాతీయ భావాలనూ తృణీకరించి జరిగింది, వాటిని పురస్కరించుకుని జరగలేదు. అందుచేతనే అధిక సంఖ్యాకులు సినిమా వ్యామోహం పాలు అయినప్పటికీ వారు కొన్నిరకాల అభిరుచులు తెచ్చిపెట్టుకుంటే గాని సినిమాలపై ఆదరం పెంచుకోలేక పోయినారు. అదే ఇంకో విధంగా చెప్పాలంటే సినిమాలు చూసి ఆనందించటం మన ప్రజలు నేర్చుకోవలిసివచ్చింది.

అటువంటి పరిస్థితిలో ప్రజలు సినిమాలకు దూరంగా ఉండిపోలేక పోయారా అనవచ్చు. ప్రజలలో సినిమా అభిరుచి వ్యాపించటానికి చాలా విషయాలు తోడ్పడ్డాయి.

1 సినిమాల రాకతో—ముఖ్యంగా టాకీల రాకతో—ప్రతి ఊళ్లోనూ స్థావర సినిమా థియేటర్లు ఏర్పడి ప్రజలకు నిత్యవినోదం ఒకటి అమలులోకి వచ్చింది. అంతకుపూర్వం నూటికోకోటికో ఒక్క నాటకంచూసే అవకాశం మాత్రమే ఉండేది. అదీకాక నాటకాలకన్న సినిమాలు చవుక. అందుచేత ప్రతిచోటా ఉండిన నాటకాలహాలులు సినిమాథియేటర్లుగా మారిపోయాయి. దానితో నాటక ప్రదర్శనాలు మరింత అరుదైపోయాయి. ప్రజలు సినిమాలవేపు మళ్లారు.

2 ప్రఖ్యాత స్టేజినటులలో కొందరు సినిమాలకు ఎగబడ్డారు. మంచి నటులు తక్కువ కాలంలో ఎక్కువ డబ్బు సంపాదించుకొనే అవకాశాలు సినిమాల ద్వారా లభించాయి. స్త్రీ పాత్రలు స్త్రీలే వెయ్యాలన్న నియమం స్టేజిమీద పూర్తిగా అమలు కానే లేదుగాని సినిమాలలో మొదటినుంచీ అమలు జరిగింది. కాలక్రమాన సినిమాలలో కూడా ప్రసిద్ధనటులంటూ తయారై స్టేజి తారలకన్న ఎక్కువగా ప్రజలను తమ ప్రతిభ ద్వారా ఆకర్షించసాగారు.

3 రాను రాను సినిమా కామెరాకు కాళ్లూ, నోరూ లభించాయి. సినిమా కామెరా సినిమాప్రేక్షకులను స్టేజిప్రేక్షకులు పోలేనిచోట్లకు తీసుకుపోసాగింది. నటుల వాచకాభినయాలతో కథ నడిచినట్టే కామెరాతో కూడా కథ నడవటం

(26-వ పేజీ చూడండి)



'అప్రతుతు లో శ్రీరంజని



వాల్ట్ డిస్నీ కార్టూన్ చిత్రం "సిండరిలా" లోని దృశ్యం

# సినిమా

(23-వ పేజీ తరువాయి)

ఆరంభమయింది సినిమాకళ తన ప్రత్యేకతను ప్రతిష్ఠించుకున్నది

4 అద్భుతమైన ఫొటోగ్రఫీ, అతి స్పష్టమైన శబ్దగ్రహణమూ, అత్యంత రమణీయమైన సెటింగులూ, దుస్తులూ, అలంకరణా, సహజత్వమూ సినిమాదృశ్యాలకు శోభ చేకూర్చాయి

5 చిత్రనిర్మాణ వ్యయం నానాటికీ పెరుగుతున్నకొద్దీ సినిమా వినోదం ఖర్చు పెరగలేదు గడచిన పదేళ్లలో అనేక వస్తువుల ధరలు నాలుగింతలూ, అయిదింతలూ పెరిగినా సినిమా టిక్కెట్ల మూల్యం దానితోపాటు పెరగలేదు ద్రవ్యోల్బణం దృష్ట్యా చూస్తే సినిమాటిక్కెట్ల ఖరీదు అంతో ఇంతో తగ్గింది కూడానూ ఆ కారణంచేత ప్రజలలో సినిమాకు ఆదరం మరింత హెచ్చింది

6 సినిమాపట్ల ప్రజలలో వ్యాప్తిచెందిన ఆదరాన్ని గ్రామఫోను రికార్డులూ, పత్రికలూ, రేడియో మరింత బలపరచి విరివిగా ప్రచారంచేశాయి

ఈ కారణాలన్నీ చూసినట్టయితే సినిమాకళకు ప్రజలలో విస్తరించిన ఆదరణకు జాతీయభావాలతో ఏమీ సంబంధం లేదని తెలిసిపోతుంది "ఇది పదహారణాల తెలుగు జీవితాన్ని ప్రతిబింబించే చిత్రం" అని చెప్పదగిన చిత్రం ఈ పది పన్నెండేళ్ళలో ఒక్కటికూడా వెలువడలేదని చెప్పవచ్చు "ఇది పదహారణాల భారతీయ వాతావరణం గల చిత్రం" అని చెప్పటానికి వీలైన చిత్రాలుకూడా మొత్తంమీద అరుదుగానే ఉన్నాయి

ఫాల్కేగారి పురాణ చిత్రాలు వెనకపడగానే మూవీలకు "ఎంగిలి" సోకింది బొంబాయిలో బయలుదేరిన కొన్ని కంపెనీలు స్టంటు చిత్రాలు తీయనారంభించాయి భారతీయులలో ఎడీ పోలోలూ, డగ్లస్ ఫెయిర్ బాంకులూ, చార్లీ చాప్లిన్లూ తయారయారు కలకత్తాలో మదన్ థియేటర్, పూనాలో బాబూరావు పెయింటర్ మొదలైనవారు మటుకు చాలాకాలం పాటు జాతీయతను కోల్పోలేదు

అయినా కాలక్రమాన దేశాన్ని జయించినది "ఎంగిలి" భావాలే ఈ పరిణామంలో మన చరిత్ర నిర్వహించిన పాత్ర కూడా కొంత లేకపోలేదు ఏ కళగాని ప్రజలకు సన్నిహితం కావటం ఆ కళను సృష్టిచేసే పారిశ్రామికులకు లాభదాయకం అయితే అది వారి జీవితాలకు సన్నిహితంగావటంమటుకు వారి ఆర్థిక - సాంఘిక సిద్ధాంతాలకు క్షేమం కాదు అందుచేత కళాహృదయం ప్రజలకు వీలయినంత దూరంలో ఉండి తన బాహ్యాకర్షణలతో ప్రజల్ని వశం చేసుకోవటం పారిశ్రామికుల ఆశయం మన సినిమా పరిశ్రమ ఆ మార్గంలోనే నడిచింది దీనికి విజాయతీయ భావాలూ, అభిరుచులూ ఎక్కువగా తోడ్పడ్డాయి మన సినిమా చిత్రాలలో ప్రతిబింబించటానికి జాతీయ జీవితమే లేనట్టు మన చిత్ర నిర్మాతలు పాశ్చాత్య చిత్రాల తాలూకు కథలలోని అంశాలనూ, పాశ్చాత్యుల దుస్తులనూ, పాటలనూ, డాన్సులనూ ఆత్మాభిమానం ఆవగింజంత కూడా లేకుండా అనుకరించసాగారు

మనం బ్రిటిషువారి నిరంకుశ పరిపాలనకింద ఉండగా మన జీవితవాస్తవికతను కళలలో ప్రతిబింబించటానికి రాజకీయ పారతంత్ర్యం పెద్ద అడ్డంకిగా ఉన్నదన్న సాకు ఒకటి ఉండేది స్వాతంత్ర్యం రాకతో జాతీయాభిమానమూ, జాతీయభావాలూ వికాసం పొందకపోగా ఇతరులను అనుకరించే భావదాస్యం, ప్రత్యేకించి సినిమా రంగంలో, మరింత హెచ్చింది

జాతీయభావాలనూ, జాతీయతనూ మన చిత్రాలలో ప్రతిబింబించటానికి మరొక అడ్డం కూడా ఉన్నది అది వ్యాపార సంబంధమైనది ఇప్పుడిప్పుడు దక్షిణదేశంలో తయారయే చిత్రాలలో చాలా భాగం ఉభయభాషలలో (తెలుగు తమిళాలలో) తయారవుతున్నాయి 'ఇది పచ్చి తెలుగు చిత్రం' అని తమిళులుగాని, 'పచ్చి తమిళ చిత్రం' అని తెలుగువాళ్లుగాని భావించటం ఆర్థికంగా చిత్ర నిర్మాతలకు లాభించదు హిందీ చిత్రాలకూ ఇదే బాధ ఉన్నది అవి దేశమంతటా చలామణీ కావాలి అందుచేతనే తెలుగు చిత్రాలలో తెలుగు జీవితం లేదు తమిళ చిత్రాలలో తమిళ జీవితం లేదు హిందీ చిత్రాలలో ఎవరి జీవితమూ లేదు

'కళకు జాతీయ సంకుచితత్వం ఉండాలా? అంతకన్న విశ్వజనీనత ఎక్కువ అవసరం కాదా?' అనవచ్చు ఇది పైకి చాలా విశాలహృదయంగల వాదంగా కనిపించినా చివరకు కళ కళకోసమే అన్న సిద్ధాంతానికి దారితీస్తుంది జాతీయ సంకుచితత్వం తప్పే అది సమష్టి జీవితం నుంచి నిష్క్రమించాలి కాని కళలలో దాన్ని లేకుండా చేసినమాత్రాన అది పోదు అదీకాక, అచ్చగా తెలుగువాళ్లు ఆనందించే కళలలో తెలుగు జీవితాన్ని ప్రతిబింబించటం జాతీయ సంకుచితత్వంకాదు "మనం తెలుగువాళ్లం గనక మన చిత్రాలలో ఇతర జాతులకు సంబంధించిన విషయాలూ, ఇతర జాతుల జీవితాలూ ఉండరాదు," అనటం సంకుచితత్వమే జాతీయాభిమానం విజాతీయ ద్వేషం ఎన్నటికీ కారాదు కాని మన చిత్రనిర్మాతలు ఇతరులనుగురించి చిత్రాలు తీయటం లేదు ఇతరులకు చెందిన ఆచారవ్యవహారాలకు చెందిన ఆచారవ్యవహారాలను మనవిగా చూపించి చిత్రాలు తీస్తున్నారు చివరకు మనచిత్రాలలో ప్రతిబింబించేది ఎవరి జీవితమూ కాకుండా పోతున్నది ఇది హృదయ వైశాల్య లక్షణం కాదు

అచ్చగా సంస్కారం దృష్ట్యామాత్రమే కాక ఇతర కారణాలను బట్టికూడా మనం సినిమా కళలో జాతీయ శిల్పం సృష్టి చేసుకోవలసి ఉన్నది ఈ శిల్పాన్ని శాసించవలసినది ప్రేక్షక సామాన్యం తాలూకు కళాగ్రహణశక్తి, చిత్రం తాలూకు కథ యొక్క స్వరూపమూ, చిత్ర నిర్మాతల ఆర్థిక పరిస్థితులు వగైరా అంతేగాని హాలీవుడ్ చిత్రనిర్మాణ ప్రమాణాలూ, హిచ్ కాక్ డైరెక్షను నైపుణ్యమూ మొదలైనవి కావు

మనచిత్రనిర్మాతలు సెటింగ్‌లను గురించీ, టేకింగుగురించీ, పాటలనుగురించీ, పాత్రల ఆహార్యాన్ని గురించీ ఆలోచించేటప్పుడు కథను మనసులో ఉంచుకోరని మనచిత్రాలలో చాలా భాగం రుజువు చేస్తున్నాయి జానపద చిత్రాలనేసరికి దుస్తులకిందా, సెటింగులకిందా, రంగాలంకరణలకిందా లక్షకుపైగా అయిపోతుంది బిచ్చగత్తెచేత పాడించే పాటకుకూడా అయిదువేల రూపాయలు ఖర్చు చెయ్యటం జరుగుతుంది ఏ మహారాజులుకూడా నివసించని ఇళ్లు సాంఘిక చిత్రాల కథానాయకులకు కల్పించటం జరుగుతుంది మన చిత్రాలలో జాతీయతా, వాస్తవికతా ఉన్నట్టయితే ఇదంతా దుర్వ్యయమే ప్రేక్షకులను ముగ్ధపెట్టడమే చిత్రనిర్మాతల ఆశయమూ, వ్యాపార లక్ష్యమూ కావటాన ఇదంతా తప్పనిసరి అయింది

ప్రస్తుతం మన చిత్రాలలో దాదాపు 800 షాట్లు ఉంటాయి ఇవి తీయటానికి 80 రోజులు పట్టవచ్చు ఇదే చిత్రాన్ని 80 షాట్లలో తీసి 20 రోజుల్లో షూటింగు ముగించినా మన ప్రేక్షకులు ఇంత తృప్తిగానూ చూడవచ్చు కాని అట్లా చేస్తే అది పాశ్చాత్య సినిమాశిల్పం అనిపించుకోదని మన ప్రొడ్యూసర్ల భయం! కాని మనం ఏ

హాలీవుడ్‌ను అనుకరిస్తామనుకుంటున్నామో ఆ హాలీవుడ్‌లోనే ఒక్కొక్క సన్నివేశమూ ఒకటే షాట్‌గానూ, చిత్రమంతా ఒకే సన్నివేశంగానూ టేక్ చేసిన చిత్రాలు తయారయాయి

ఫేడిన్ లగాయతు మళ్లీ మిక్స్ దాకా, లేక ఫేడౌట్ దాకా ఒకే షాట్‌గా ఎందుకు తియ్యరాదంటే మనవాళ్లు చెప్పే అభ్యంతరాలలో ఒకటి ఏమంటే మన సినిమానటులు సరిగా సంభాషణలు చెప్పలేరనీ, అభినయంలోనూ, కదలికలోనూ తప్పులు చేస్తారనీనూ ఈవిషయం సినిమా ప్రపంచంలోనివారికి ఆశ్చర్యం కలిగించకపోయినా పైవారికి ఆశ్చర్యం కలిగించవచ్చు ఎందుచేతనంటే మన స్టేజినటులలో ప్రతిఒకడూ తెరలేచి పడేదాకా తన పాత్రను తాను నిర్వహిస్తాడు సినిమా దృశ్యాలు స్టేజిదృశ్యాలంత పొడవుండవు సినిమా సంభాషణలు స్టేజిసంభాషణలంత దీర్ఘంగా ఉండవు నాటకప్రేక్షకులలాగా కాకుండా సినిమా కామెరా కదులుతుంది అందుచేత ఆ దృశ్యంలోఉన్న ప్రతి మనిషీ దృశ్యం పూర్తిఅయేదాకా కామెరా ఎదురుగా ఉండనవసరంలేదు అందుచేత కామెరా ఎదటలేని విరామంలో తన అభినయాన్ని గురించీ, సంభాషణ గురించీ ఆలోచించుకోవచ్చు కాని మన చిత్రనిర్మాతలు చెప్పేది నిజమైతే సినిమా నటులు నాలుగైదునిమిషాలపాటు కూడా కామెరా ఎదట నిలబడటానికి శక్తిలేనివారని తేలుతున్నది అట్లా అయితే వారు పుచ్చుకుంటున్న పెద్ద మొత్తాలు వృథా అనాలి

ఆర్థికసమస్య చాలా ముఖ్యమైనది నాలుగులక్షలుపెట్టి చిత్రంతీస్తే 12 లక్షల రూపాయలు ప్రేక్షకులిస్తేగాని పెట్టుబడి తిరిగిరాదు దాదాపు 50 లక్షలమంది ప్రజలు చూస్తేనేగాని సినిమా చిత్రం గిట్టింపుకాదనుకోవాలి మన సినిమాశిల్పం ఆర్థికదృష్టిలో ఖర్చుతో కూడుకున్నది కాకుండా ప్రజల దృష్టిలో సముచితమైనదిగా ఉండేటట్టు చూసుకున్నట్టయితే ఇంత దుస్థితి ఉండదు కాని అటువంటి శిల్పం వ్యాప్తిలోకి తీసుకువచ్చే ప్రయత్నం ఎక్కడా కనిపించదు ★

# కరణాన్ని ఎదిరిస్తే...

(11-వ పేజీ తరువాయి)

అబ్బిరెడ్డికి శిక్షపడేరోజున పిచ్చిరాజు కోర్టుకెళ్లి, మునసబ్‌కు ఆకువక్కలిచ్చి "మునసబ్ గారూ! అత్తవారింటికి వెళ్ళుతున్నారు ఏదో పుట్టింటివారము. బీదవారము ఆకువక్కకుమించి ఏమియివ్వలేము కరణాల బజారుకువచ్చి ఉల్లం మీద కూర్చొని దిలాసాగా మాట్లాడటమనుకున్నావా, కరణం అంటే నీకు గడ్డిపోచా! పిచ్చిరాజుకోపం అంటే ఏంటో తెలిసిందా" అని మునసబ్ జవాబుకు ఎదురుచూడకుండా చరచర వెళ్ళిపోయ్యాడు మునసబ్ గారు ఖిన్నుడయ్యాడు మా తాతగారికి కళ్ళనెంబడ నీళ్ళుగిర్రున తిరిగినవి ఆస్తిపరుడు, గౌరవనీయుడు మునసబ్ తనకు శిక్ష పడ్డగ అవమానం గుండెబగిలి 3 నెలల్లోనే రెయిల్లో చచ్చిపోయ్యాడు

ఇంటికి వచ్చిన తరువాత "సరయ్యా! పిచ్చిరాజు దెబ్బ రంగం చూచాడు, మునసబ్ మూచాడు కరణాన్ని త్రోసికరిసి కాటికి పల్లినట్టె తెలిసిందా" అని హెచ్చరించి పిచ్చిరాజు నవ్వుతూ ఇంటికి కెళ్ళాడు ★

# కుండపెంకులు

(౨౨-వ పేజీ తరువాయి)

ఒక్కమారు అన్యాయంగా నాకు నష్టపోయానిపించి దుఃఖభారం ఎక్కువ తాకిడితో తగుల్తుంది ఈ సంగతి గుర్తించావనుకుంటాను '

సంజచీకట్లో కూడా శకుంతల ముఖంలోని ఎర్రదనాన్ని గుర్తించాను ఆనక కొంచెం బెంగగా ఈ మాటలు వచ్చాయి 'అలా అయ్యేందుకు రెండు నెల్లు చాలవులెండి '

'ఆమాత్రం ధైర్యం నువ్వు చెప్తే చాలు నేను హోలిండియా అంతా తిరిగొచ్చేస్తాను '

'అంతగా ఏమయినా అయితే మీకు ఉత్తరం రాస్తానుగా!'

'ఆ మాటే ను వ్వంటావా లేదా అని చూస్తున్నాను ఇంక నాకు నిశ్చింత ఎడబాటులో విచారం తప్ప మరేం లేదు '

'మా నాన్న అసలల్లా మారిపోయేవారని మీ ఉద్దేశమా?'

'అంటే?'

'అంటే యేమిటి? ఆయన ఏ వుద్దేశం కలిగివున్నారో మీకు తెలీదా యేమిటి?'

'నీకు నమ్మకమేనా, ఆ పాత ఉద్దేశం మీద?'

'మీగూ తక్కువ్వారు కాదే! అమ్మనాయనో, ఏమీ అమాయకు లనుకున్నాను గాని మీరూ కొన్న ఖరీదుకు ఉన్నారు మెల్లిమెల్లిగా నా సంగతీ నాన్నగారి సంగతీ కనేసుకున్నారు '

'అలా అనుకుంటున్నా వన్నమాట నా మనసులోని ఆరాటం నీకేం తెలియదని మళ్లా నా కర్థమైంది '

'అర్థమైందండీ బాబూ తమ రేమంత హైక్లాసు మనుష్యులని?'

* * * *

'ఎవరికిరా బాబూ ఉత్తరం?' అన్నాడు మామయ్య

'అది నీ జ్యూరిస్ డిక్షన్ కాదు ' అన్నాను నవ్వి

'కాదులే సంగతడిగాను '

'తెలుసుకోడంవల్ల లాభం లేదని చెప్పాక తెలుసుకోవడం మానుకుంటావా?'

'లాభం లేకపోవడ మేమిటి? ఈ ప్రపంచంలో ఎంత జ్ఞానాన్ని వీలయితే అంత జ్ఞానాన్ని బుర్రలోకి ప్రవేశపెట్టాలని నువ్వే అంటేవిగా! మరి అలాటప్పుడు లాభంలేని జ్ఞానం ఉంటుందా?' అని నవ్వాడు మామయ్య

'పోనీలే, ఆ వాక్యాన్ని ఉపసంహరించుకుంటున్నాను ఈ వుత్తరంగురించి అడగడం మానుకో '

'ఉపసంహరించుకుందికి వీల్లేదే కాలు జారితే తీసుకోవచ్చుగాని నోరు జారితేనా?'

'ఏమైనా సరే బాబ్బబూ, దీన్ని గురించి నన్నేం అడగవద్దు నన్ను ఇబ్బంది పెట్టవద్దు ' అని మడిచి జేబులో పెట్టేశాను ఉత్తరాన్ని

"నువ్వు చెప్పకపోతే నాకు తెలీదా ఏమిటి? పేరు శకుంతల డాటర్ ఆఫ్ వంకటేశ్వర్లు "

'సరే ఆమాత్రం తెలుసుకున్నవాడివి ఇంకా ఎందుకు నన్ను వేధిస్తావు?' అని కొంచెం చిరాగ్గా అడిగాను

'ఊరికే నే, నీ సిగ్గు ఎంతవరకో చూదామని '

'సిగ్గు కేముంది? ధైర్యంగానే చెప్తాను నేను పెళ్లే చేసుకుంటే శకుంతలని తప్ప ఇంకెవర్నీ చేసుకోను '

'ఆ పెళ్లే ఏమంటుందో తెలీదు గాని!' అన్నాడు మామయ్య ఎకసక్కెంగా

'అది సమస్యరూపం దాల్చుతుందో లేదో చూసుకొని మరీ వొచ్చాను నిర్ణయానికి అమ్మతో కూడా చెప్పాను నా పెళ్ళికి తనేమీ ప్రయత్నించక్కర్లేదని '

'నాలుగు గోడలూ బందోబస్తు చేసుకొని మరీ వున్నావన్న మాట ' అన్నాడు మామయ్య సరదాగా

'నీకంత తేలిగ్గావుంది నా జీవితసమస్య అంటేను!'

'ఒరే బాబూ, మేమూ మనసులు గలవాళ్ళమేన్రా నాయనా కాని మా కాలాల్లో ఇంత ఎరగం పట్నంవాసం ఎంత పనైనా చేస్తుంది మరి!'

'నేను పట్నంలో అడుగుపెట్టక ముందునించీ వుందీ కథ వంకటేశ్వర్లు మామయ్య మొదట్నించీ అంటున్నదే '

మామయ్య నన్ను ఈవిధంగా కదిపించడంవల్ల నాకు శకుంతలమీద ప్రేమ ఎక్కువేఅయిందని నే ననుకున్నాను ఉద్దేశం ఉన్నదే, శకుంతలనే పెళ్లిచేసుకుందామని, అదంతా గట్టిపడ్డది ఈ సంగతే శకుంతలకు ఉత్తరంలో రాశాను- ప్రణయానికి ఎన్ని ప్రతిఘటనలొస్తే చక్రవడ్డీలాగ ప్రణయం పెరుగుతుందని!

ఇంకో విషయం కూడా ఉంది మామూలుగా అందరూ విరహం కష్టమంటూంటే నేనూ కష్టమే అనుకొని మొదట విరహంలో పడడానికి విచారించాను కాని ఎంతసేపూ దగ్గిరున్నప్పటి ప్రేమకు విరహంలో ప్రేమ ఏమీ తక్కువకాదు ఎదురుగుండా మనిషి కనపడుతూ సంభాషించేటప్పటి భావవిభజనకంటె, ఒంటరిగా వుండి మనసులో ఆశాసౌధాలు నిర్మించుకొనేటప్పటి భావవిజయంలోని సౌఖ్యమే ఎక్కువ పైగా ఎదురుగుండా మనిషి ఉండేటప్పుడు పెద్ద స్పీచిగాని విశదీకరణంగాని ఆశించలేము దూరంగాఉంటే అంతా విపులంగా ఉత్తరంలో రాయగలము, రాయించుకోగలము సంభాషణకంటె విశదీకరణమే ఎక్కువ బాగా తోచి నాకు విరహంలో కష్టం స్ఫురించలేదు

కాని మొట్టమొదటి వుత్తరానికి శకుంతల రాసిన జవాబు దీనికి వ్యతిరేకంగా వుంది నేను ఏ భావ వ్యక్తీకరణంకోసం ఆశించానో అది కాలేదు ఏ విశదీకరణంకోసం అర్రులు చాచేనో అది అందలేదు కేవలం ఇలా వున్నది శ్రీ బావగారికి, మీ ఉత్తరం అందింది జవాబు ఎంత మధురంగా రాస్తావో అంటారు కాని ఏం రాయనూ? నా చుట్టూ ఏమున్నాయి ఉత్తరంలో రాయవలసినంత ముఖ్యమైన సంగతులు? మీకు ఊసుపోవడం లేదన్నారు ఇక్కడ నాకేం అంత కష్టంగాలేదు మీకు కూడా కష్టంగా లేదనే నా నమ్మకం కేవలం వేషజంకోసమని అలా రాసివుంటారని అనుకుంటున్నాను ఇందువల్ల నన్ను అన్యథా భావించరని తలుస్తాను అంతా క్షేమం-మీ శకుంతల ఈ వుత్తరంచూసి నేను మొదట కొద్దిగా కోపగించుకున్నాను శకుంతల నిర్మొగమాటానికి కాని నెమ్మదిగా ఆ నిర్మొగమాటంగా చెప్పిన సంగతి నిజమేనని గుర్తించుకున్నాను

ఇంకో ఉత్తరం నేను ఇల్లుబయలుదేరిన రెండు నెలలకి వచ్చింది 'ఈ మధ్యన మా యింటకి ఎవరో మారపుబంధువులు మనిషితో ఉత్తరం పంపారు, నన్ను వాళ్లకుర్రాడికి చేసుకుంటారట, మా నాన్నగారు ఇదివరకు మీ అమ్మతో మన సంగతి చెప్పారుట-కాని ఆవిడ ఊరుకొనేదట-అందుచేత ఆవిడ ఇష్టం కనుక్కుందికని మీ ఎడ్రసుకోసం ప్రయత్నించారు మీ ఎడ్రసు నాకు తెలుసునని ఆయన ఎందుకో గుర్తించలేకపోయారు మరి అడగకుండా నేనుమాత్రం ఎందుకు చెప్పాలి? '

## గ్రంథ సమీక్ష

"ఎవరు దొంగ" - నాటిక - కర్త శ్రీ ఆచార్య ఆత్రేయ - ప్రకాశకులు అరుణ రేఖా పబ్లికేషన్స్, నెల్లూరు - వెల తెలియదు

---

ఒక్కమారు భయమూ ఆత్రుతా నన్ను చుట్టేశాయి మా అమ్మమీద కోపం కూడా వచ్చింది ఇలాటి సుభావమేకదా జీవితాల్ని నాశనంచేసేది! తనకి కూడా ఇష్టమాయె-మే మిద్దరం ఒకచోట ఉండడం-మరి ఈ ఊరుకోవడం దేనికి, నన్ను శకుంతలనుంచి దూరం చెయ్యడం దేనికి?

మా అమ్మ నా రహస్యాన్ని రహస్యంగానే ఉంచుతుందనుకున్నాను అనుకొని రోజూ మనవూ రెప్పుడు వెళదామని నిలగీయసాగాను ఈ సంగతి ఇతరులకి తెలియకూడదని కోరాను మనసులో కాని అమ్మ మామయ్యతో చెప్ప కొంతసేపూ, సొంతంగా సూటిపోటు మాటలని కొంతసేపూ నన్ను బాగ పెట్టింది నాకు శకుంతలపైగల ప్రేమను ఇతరులకు తెలియకుండా దాచడం నా మతంకాదు కాని కేవలం శకుంతలకోసమే మావూరు వెళతానంటున్నానని అందరికీ తెలిస్తే సహించలేను అది ఇతరులకి సన్మార్గంలో అర్థంకాక నవ్వులాటలుగా అర్థమౌతుంది అలా నవ్వుకుంటే నాకు ఆత్మద్వేషమే కలుగుతుంది

ఆ పుత్తరం వచ్చిన రెండోజులవరకూ ఇలాగే అయింది తరవాత ఒకనాడు మా అమ్మ నోటంట ఇంకొకరి చెవికి పోతున్న శబ్దాన్ని గుర్తించాను 'ఎల్లుండి విదియ నాడు పోతున్నాం' మొట్టమొదట నాకు నమ్మకం కలగలేదు కాని ఆ వేళ మామయ్య "అదేమిటక్కా, దసరా దశమిదాకా ఉండరాదా" అన్నాడు దాంతో నిజమేనని తట్టింది మా అమ్మ "కాదురా ఇది ముందు మాసుకుంటే గాని ఏమిటో బెంగలా వుంది రాత్రీపగలూ అనక అక్కడయిల్లు కటకట ఎలా వుందో ఏమిటో-మూట్లెట్లయిపోయింది వొదిలి" అంది

రెండు రోజుల్లో మేం బయలుదేరి వచ్చేశాం (ఇంకా వుంది)

ఆచార్య ఆత్రేయ యువకుడైనా నాటక కర్తగా ఇప్పటికే ఆంధ్రదేశంలో చాలా కీర్తి గడించాడు "ఎవరు దొంగ" అన్న నాటిక ఆత్రేయ ప్రతిభకు మరొక నిదర్శనం

ఈ నాటకంలోని శిల్పం శక్తివంతమైనది ఇది సంఘానికి అద్దం పట్టటం కాదు, బరువైన గొడ్డలి ఎత్తి సంఘం తాలూకు కుళ్లు భాగాలమీద బలంగా కొట్టటం అందుచేత ఇటువంటి నాటకాలు చూసేటప్పుడు ప్రేక్షకులు నాటక ప్రభావానికి బలంగా గురి అవటం జరుగుతుంది ఈ నాటక శిల్పం క్లిఫోర్డ్ జిడెట్స్ మొదలైన పాశ్చాత్యులు సృష్టించినదైనప్పటికీ కాల పరిస్థితిని బట్టి మన సమాజానికి చాలా ఉపయోగపడుతుంది ఈ శిల్పం ప్రేక్షకులను నటులనూ, నాటకానికీ చాలా దగ్గిరగా తెస్తుంది నాటక రచయితా, ప్రకాశకులూ ప్రశంసనీయులు

"స్నేహమయి" - పద్యకావ్యం - కర్త: శ్రీ శొంఠిరాల సత్యనారాయణ, తెలుగు పండితుడు, శరభయ్యగుప్త హైందవోన్నత పాఠశాల, సత్తెనపల్లి - వెల ఒక రూపాయి

ఇది ప్రణయకావ్యం విప్రలంభ శృంగారంతో కూడుకున్నది గ్రంథానికి "తిలకము" వ్రాసిన శ్రీ వీరరాఘవాచార్యులు గారు ఈ గ్రంథాన్ని గురించి పొగడుతూ " ఇట్టి భూషను తొలుదొల్త ఆంధ్రికి సమర్పించినవారు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు తరువాత శ్రీ నండూరి సుబ్బారావు గారు తృతీయుడీ సత్యనారాయణ" అన్నారు అది అతిశయోక్తిగా కనపడుతుంది ఇందులోని కవిత్వం మాట ఎట్లాఉన్నా నవ్యాంధ్ర సరస్వతి కిప్పుడు కావలిసిన భూషలు శృంగార కావ్యాలు కావేమో






# "న్యాయం!"

శ్రీ ఘట్టి కృష్ణమూర్తి

పెట్టిపుట్టిన సెట్టికి
పెట్టెలనిండా డబ్బు!
తట్టల్లో బుట్టల్లో
తరగని నవరత్నాలు–

ఉండటాని కొక్క పెద్ద
ఊరంతటి మేడ!–
కొండమీది కోతినైన
పండువలె తెస్తాడు,

కారుమీద తిరుగుతాడు
జోరుగ తాగేస్తాడు
కల్లూ, సారా, బ్రాందీ–
కడివెడు పీలుస్తాడు

చేతినిండ డబ్బున్నది,
చేసే పనులూ లేవు
జూదానికి వెళ్లుతాడు
జూలేవిడి తింటాడు

వాడకల్లా వాడొక్కడె
కోటికి పడగెత్తాడు–

* * *

చెదలు తిన్న గుడిసెలోనె
సుబ్బన్న నివాసం.
పాక కూలిపోకుండా
పోటీ పెట్టెను వాసం.
పొట్టకూటికై రోజూ
కట్టెలు పగలేస్తాడు
చుట్టపొగాకైనా మరి
ముట్టుకోడు సుబ్బన్న.
చుట్టూ చేరి వాళ్లను
పొట్టలుబ్బ నవ్విస్తాడు.
పైరుగాలిలో కూచుని
పాటలు పాడేస్తాడు
పోరూ, పొక్కూ లేకను
పొందికగా బ్రతుకుతాడు.

ఒక్కనాడు సుబ్బన్న
ఒంటిగంటవేళప్పుడు
రెక్కలు ముక్కలు చేసుకు,
రోజుకుంటు, రొప్పుకుంటు

మండుటెండలో
కండలు కరిగిస్తూ,
మరిగిస్తూ,
కట్టెపేళ్ల కావిడితో
కొట్టుకు పోతున్నా–
డెచటికో
ఇంతలోనె వేగంగా
వెనుకనించి వస్తోంది:

సెట్టిగారి కారంటే
చప్పుడుగిప్పుడు లేకనె
డేగల్లే దూకుతుంది!–
ఖరీదైన కారుకసలు

చప్పుడుండదుట ఖర్మం!-
కల్లూ, సారా త్రాగితే
కైపెక్కిన కళ్లకు
కనబడుతుందా రస్తా?
మరి, మ్రోగిస్తాడా హారన్?-
సుబ్బన్నకు కడుపులోన
ఆకలి సుడితిరిగింది.

సెట్టిగారి చేతుల్లో
కారుకు వడి పెరిగింది.

కట్టెల కావిడిబరువై
కొట్టుకు మిట్టాడుతుంటె
సెట్టిగారు మోటారును
డబాయించి వదిలాడు.

సుబ్బన్నకు కాళ్లల్లో
సత్తువ సన్నగిలింది;
సెట్టిగారి చేతుల్లో
వేగం చురుకెక్కింది.

వంతెన ఎక్కేటప్పుడు
అడుగుపడదు సుబ్బన్నకు,
కళ్లల్లో చెమట కారి
చూపులు గజిబిజి ఆయెను-
ఒళ్లు తెలియని సెట్టి
పళ్లుబిగించాడు.

కైపెక్కిన కళ్లతోనె
కారు తోలుతున్నాడు.
ఎందుకనో. సుబ్బన్నకు
వెన్నుఝల్లు నదిరింది
కడుపులోన ఆకలేసి
కళపెళలాడింది

"కావిడి మారుద్దాం
అటుబుజంమీద"
కనుకుంటూ
ముందు కడుగు వెయ్యకుండ
మెడవంచుకు మార్చాడు .
తడబడుతూ నడిచాడు.

సెట్టికారు ఇంతలోనె
పుట్టి మునిగిపోయినట్టు
మట్టుపెట్టి సుబ్బన్నను
ముందుకు దూకింది.

"అమ్మో" అన్నాడు కా[illegible]
అది గాలిలో కలిసింది.-
తెట్టులు కట్టిన-
వేడి నెత్తురును
తాగేసిందా
మురికికాలవ-
పోలీసులు వచ్చారు

"పంచాయతి" చేశారు"
బ్రతగలేక సుబ్బన్నే
కారుకింద పడ్డాడని
పదిమందీ తేల్చారు!
పేపర్లో వేశారు!!



# జాలరి యుక్తి

శ్రీ డి. శ్రీరాములు

పూర్వకాలమున ఒక ముసలి జాలరి ఉండెడివాడు అతడు చాల నిరుపేద అతనికి ఒక భార్య ముగ్గురు బిడ్డలు కలరు వాడు చేపలు మూలమున సంసారము గడుపుచుండెను అతడొకనాడు వేకువనే లేచి చేపల వేటకు బయలుదేరెను వేటసమయములందు వలను నాలుగు పర్యాయములు వేసెడివాడు ఒక్కొక్కప్పుడు నాలుగు పర్యాయములందు ఎక్కువ చేపలు పడుచుండెడివి మరియొక్కొక్కప్పుడు బొత్తిగా పడకుండెడివి పడనిరోజు ఇంటియందు పస్తు పడిన రోజు పండుగ

మన జాలరి నదిచెంత చేరి వలను సర్ది నదిలోనికి విసరెను కొంతసేపటికి అతనికి వల చాల భారముగా నుండినట్లు తోచినది వాడు మహా సంతోషముతో వలను బయటికి లాగి చూడగా అందులో ఇంకేమున్నది! ఒక చనిపోయిన గాడిద శవం రెండవమారు వేయగా నత్తగుల్లలును, రాళ్ళును దొరికినవి మూడవసారి వేయగా బురద, గవ్వలు మొదలైనవి దొరికినవి మరల నాల్గవ పర్యాయము భగవంతుని ధ్యానించి వలవేసెను అట్లు తన వలను తీరమునకు లాగి పరీక్షించగా అందు ఒక రాగిబిందె కనబడెను ఆ బిందె మూతికి సీసముతో మూత వేయబడియుండెను ఆ జాలరి దానిని ఎవరికైనా అమ్మి ధనము సంపాదింపవలెనని తలచెను ఆ బిందె మిక్కిలి బరువుగా నుండుటచే దానియందు ద్రవ్యము ఉండునని మూతను తెరచెను

తెరచుటే తడవుగ అందుండి పొగ బయలుదేరి ఆకాశమంతా దట్టముగా వ్యాపించెను క్రమముగా ఆ పొగ ముద్దగా నేర్పడి అందుండి ఒక వికృతాకారముగల రక్కసుడు పండ్లు పట పట కొరుకుచూ జాలరి మీదికి రాదొడంగెను జాలరి వణకుచూ అచ్చటినుండి పారిపోలేక, కూలబడెను

'ఓరీ దుర్మాత్ముడా! నిన్నిప్పుడే సంహరించెదను నీవే విధముగ మరణించుటకు ఇష్టమో త్వరగా చెప్పు!' అని గర్జించెను

జాలరి ధైర్యము తెచ్చుకొని 'ఓ పిశాచమా! నీచరిత్రమేమి' అని అడిగెను

అందులకు "ఓరీ మూర్ఖా' విను

(42-వ పేజీ చూడండి)

 




జరిగిన కథ :—

1537 వ సంవత్సరం లండన్‌లో హెన్రీ మహారాజుకు ఎడ్వర్డు అనే కొడుకూ, నిరుపేద జాన్ కాంటీకి టామ్ అనే కొడుకూ కలిగారు. ఇద్దరూ ఒకే పోలిక. పదేళ్ల వయస్సప్పుడు టామ్ రాజభవన కేసి వెడతాడు. యువరాజు ఎడ్వర్డు టామ్‌ని లోపలికి తీసుకుపోయి ఆదరిస్తాడు. ఒకరి జీవితంమీద మరొకరికి ఆసక్తికలిగి దుస్తులు మార్చుకుంటారు. టామ్ దుస్తుల్లో యువరాజు కోటబైటకు రాగానే అతన్ని ప్రజలు నానాబాధ పెడతారు. తను యువరాజునంటున్నకొద్దీ వాళ్లు అతన్ని ఇంకా ఎక్కువబాధ పెడతారు. అక్కడ కోటలో యువరాజు దుస్తులుధరించిన టామ్‌ను యువరాజుగానే అంతా పరిగణిస్తారు. అతడు తను బిచ్చగాళ్ల కుర్రాడినని చెప్పినా వాళ్లు పిచ్చెక్కింది అనుకుంటారేగాని అతనిమాట నమ్మరు. ఈలోగా వృద్ధరాజు హెన్రీ చనిపోతాడు. బిచ్చగాడి దుస్తులతో తిరిగే యువరాజు ఎడ్వర్డును మైల్స్ హెండన్ అనే వీర యువకుడు చేరదీస్తాడు. కాని తాను ఇంటలేనప్పుడు యువరాజు తాగుబోతైన జాన్ కాంటీ చేతుల్లోపడినట్లు తెలిసి హెండన్ బయలుదేరుతాడు. వృద్ధరాజు చనిపోవటంతో వేల్స్ యువరాజు కొత్త రాజు కావటం చేత రాజభవనంలోని టామ్ కాంటీకి రాజమర్యాదలన్నీ జరుగుతూ ఉంటాయి. అతను రాజహోదాలో ఉన్నాడు గనక తన అధికారం వినియోగించి, అకారణంగా మరణదండన పడిన ముగ్గుర్ని చాలా తెలివిగా విచారణచేసి విడిపిస్తాడు. అక్కడ బాలరాజు జాన్ కాంటీ ఒక దొంగల ముఠాలో ప్రవేశపెడతాడు. వాళ్లతన్ని పిచ్చివాడికింద కట్టి అవమానిస్తూ ఉంటారు. ఇక చదవండి.

అనువాదం
శ్రీ
నండూరి రామమోహనరావు

## 20

దొంగల ముఠా తెల్లవారు జామునే లేచి తూర్పుకు ప్రయాణం సాగించారు. బాగా మబ్బుపట్టి చలి వణికించేస్తోంది. వాతావరణంమాదిరిగానే ముఠా వాళ్ళు కూడా దిగులుగా, బెంగగా ఉన్నారు. రాత్రి ఉత్సాహమంతా చచ్చింది. దీనికి గాలి మార్పు కారణం కావచ్చును, లేక ఆకలి మంటలు కారణం కావచ్చును.

కొందరు మౌనంగా ఉన్నారు, కొందరు ముట్టుకుంటే కరిచేట్టున్నారు, మొత్తానికి అందరూ బిక్కమొగాలేశారు

ముఠా నాయకుడు బాలరాజును హ్యూగో అదుపులో ఉంచాడు, పసివాడి జోలికి పోతే తన్ని తగిలేస్తానని జాక్ కాంటీని హెచ్చరించాడు, అతన్ని జాగ్రత్తగా కాపాడమని హ్యూగోను ఆజ్ఞాపించాడు

కొంచెం ప్రొద్దెక్కింది, మబ్బులు విచ్చి, చలి తగ్గింది మురావాళ్ల మొగాలు కాస్త తేటపడ్డాయి ఉత్సాహం కాస్త కాస్తే తిరిగి వచ్చింది. చివరికి యథాప్రకారంగా రౌడీపనులు ప్రారంభించారు ఒకళ్ళనొకళ్లు తిట్టుకోవడం, తిమ్ముకోవడం సాగించారు రోడ్డుమీద పోయే వాళ్లనుకూడా దుర్భాషలాడి అవమానించసాగారు ప్రతివాళ్లు ఈ దొంగలకి దాదితొలగి, వాళ్లు ఏమన్నా తలవంచుకు పోవడం చూస్తే ఆరోజుల్లో ఇలాంటి పోకిరీతనానికి ఎంత పలుకుబడి వుందో తెలుస్తుంది ఊళ్ళబయట చాకళ్లు బట్టలారవేసుకుంటే మన రౌడీలు బహిరంగంగా తమకి కావలసిన వాటిని అపహరించారు పాపమా చాకళ్లు బట్టలు పోయినందుకు విచారించలేదు సరిగదా, తమ శరీరాలు క్షేమంగా ఉన్నందుకు సంతోషించి ఊరుకున్నారు

చివరికి దొంగలు ఒక ఊళ్లో ఒక రైతుఇంటిమీద దాడి చేశారు ఈ జబర్దస్తీ అతిథులను చూసి ఇంటి యజమాని, అతని భార్య, కొడుకులు, కూతుళ్లు గజగజ వణుకుతూ స్వాగతమిచ్చారు ఇల్లంతా శుభ్రంచేసి భోజనం ఏర్పాట్లు చేశారు. దొంగలు భోజనం చేస్తూ యజమాని భార్యతోను, కూతుళ్లతోను వేళాకోళాలు, సరసాలు ప్రారంభించారు ఇష్టమొచ్చినట్లు బూతు మాటలు వాడుతూ, భోళ్లున నవ్వడం మొదలెట్టారు. మాంసంలో వచ్చిన ఎముకముక్కలను బాగా చీకి చీకి, ఇంటి యజమాని మీద, కొడుకులమీద విసిరారు, నెత్తికి రంగున తగిలినప్పుడల్లా నవ్వారు భోజనానంతరం కొంచెం వెన్న మిగిలితే యజమాని కూతురుకు బుగ్గలమీద పులిమారు చివరికి నిష్క్రమిస్తూ, తమ దండయాత్ర సంగతి అధికారులకు గనుక తెలియజేస్తే ఇల్లంతా దోచుకుని, తగులబెట్టిపోతామని, బెదిరించి మరీ వెళ్లారు

మధ్యాహ్నమయ్యే సరికి దొంగలు ఒక పెద్దగ్రామం చేరారు ఒక గంటసేపు ఊరిబయట గడ్డివాముల వెనక విశ్రమించారు తరవాత ఎవరికి వాళ్లు విడిపోయి వేరువేరు దోవలగుండా ఊళ్లోకి ప్రవేశించారు. ఎవడికి చేతనైన వృత్తి వాడు అవలంబించి మర్యాదగా డబ్బు సంపాదించే ప్రయత్నాలు చేశారు

బాలరాజును వెంటబెట్టుకుని హ్యూగో వీధుల్లో తిరిగాడు వాడికి ఏం చేయడానికీ పాలుపోలేదు

"దొంగతనానికి వీలు చిక్కేటట్లు లేదు ఇంత దరిద్రగొట్టు ఊరు నేనింకెక్కడా చూడలేదు. ఒకే జాక్, బిచ్చమెత్తుదామా ?"

"నీ ఇష్టం వచ్చినట్టు చెయ్యి నేను మాత్రం నీకు సహాయం చెయ్యను," అన్నాడు బాలరాజు

"చెయ్యవూ ? బిచ్చమెత్తడం చేతగాదా ?"

"చేతగాదు"

"ఎప్పటినుంచీ బాబూ ? నువ్వు లండన్‌లో పుట్టినప్పటినుంచీ చేసిన పనేమిటి ?"

"నోర్ ముయ్ కుక్కా !"

"అట్టే ఖర్చు చెయ్యకు తిట్లు నీకు పెళ్ళయ్యాక పెళ్లాం మీద ప్రయోగిద్దువు గాని లే వాటిని. నువ్వు రోజూ అడుక్కువచ్చేవాడివని మీ నాన్న చెప్పలేదా ?"

"వాడు నా తండ్రా? వాడెవడో నే నెరగను"

"ఇదుగో నబ్బాయ్. నీకింకా వెర్రి కుదర్లేదు కాస్సేపు ఏదో సరదాగా అన్నావు, బాగుంది. అస్తమానమూ అదే పాటా ? ఇల్లా అన్నావని మీ నాన్నతో చెప్పావంటే నీ చర్మం వలిచేస్తాడు"

"వాడి కెందుకా శ్రమ. నేనే వాడికి చర్మం ఒలిపిస్తాను"

"నీ ధైర్యాన్ని మెచ్చుకోవలిసిందే మెచ్చుకుంటున్నానుకూడా. కాని నీ తండ్రి అబద్ధం చెబుతున్నాడని అనుకోను అంటే అతనికి అబద్ధాలు చేతకాదని కాదు. అవసరమొస్తే అంత చక్కగా అబద్ధమాడగలవాడు ఇంకోడు లేడు! కాని అవసరమేమీ లేనిదే, ఇలాంటి చిన్న విషయాల్లో అబద్ధమెందుకు ఆడతాడు ? తెలివైనవాడు అబద్ధాల్ని చాలా పొదుపుగా వాడుకుంటాడు.

సరే బిచ్చమెత్తవద్దులే. ఏదన్నా దొంగిలిద్దామా?”

“నన్ను విసిగించకు, నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో”

హ్యూగోకు కోపం వచ్చింది.

“బిచ్చమూ వద్దు. దొంగతనమూ వద్దు. ఇంకేం చేద్దామంటావు? ఆఖరుసారి న్యాయంగా చెబుతున్నాను విను నేను నేల మీద పడి మూలుగుతూ ఉంటాను నువ్వు దారీ పోయేవాళ్లను అడుగు. మాట వినకపోతే నీ పని పట్టిస్తా”

బాలరాజు ఏదో గర్జించబోయాడు హ్యూగో అడ్డంవచ్చి,

“అదుగో ఎవరో పెద్దమనిషి వస్తున్నాడు. మంచివాడులాగా ఉన్నాడు నేను కిందపడి దొర్లుతూ మూలుగుతూ వుంటాను. ఆయన దగ్గరకు రాగానే నువ్వు గొల్లున ఏడవాలి. “బాబూ! ధర్మం చెయ్యండి నా అన్న మూర్ఛ రోగంతో చస్తున్నాడు మాకెవరూ దిక్కులేరు. ఒక్క పెన్నీ ధర్మం చెయ్యండి మీపేరు చెప్పుకుని బతుకుతాం కనికరించండి—’ అని కాళ్లా వేళ్లా పడి గోలగా ఏడవాలి. ఆయనదగ్గిర్నుంచి పెన్నీ పిక్కేందాకా వదలద్దు,” అని వెంటనే నేల మీద అకస్మాత్తుగా విరుచుకు పడ్డాడు. పంది మూలిగినట్లు మూలగడం, కళ్లు తేలవేసి దొర్లడం, జుట్టు పీక్కోడం, మొదలైన దొంగవేషాలన్నీ అతినేర్పుగా ప్రదర్శించసాగాడు. దూరానపెద్ద మనిషిదగ్గిరకొచ్చేసరికివాడి అవతారం ఎలాఉండాలో అలా వుంది. వాడిమూలుగు ఇంకా ఉధృతమైందికూడాను.

“అయ్యయ్యో ఎవరీ అబ్బాయ్? ఎందుకల్లా పడి కొట్టుకుంటున్నాడు? అయ్యోపాపం పట్టులేవతీద్దాం,” అని ఆ పెద్దమనిషి జాలితో అన్నాడు

“ముట్టుకోవద్దు బాబూ, ముట్టుకోవద్దు. ఈ మాయరోగం నన్ను పడేసినప్పుడు ఎవరూ ముట్టుకోగూడదు ముట్టుగుంటే ఆ రోగం మీ క్కూడా అంటుకుంటుంది. నా తమ్ముణ్ణి అడగండి నా బాధంతా చెబుతాడు ఒక్క పెన్నీ బాబూ. ఒక్క పెన్నీ దయ చెయ్యండి. నాలుగు రోజుల్నించీ తిండిలేక ఎండిపోయాం ఒక్క పెన్నీ పారేసి మా ఖర్మకి మమ్మొదిలెయ్యండి,” అని హ్యూగో విలవిలలాడసాగాడు

“ఒక్క పెన్నీ యేం ఖర్మం! మూడు పెన్నీలిస్తాను తీసుకో నాయనా! పాపం ఎంత కష్టంలో వున్నావో!” అంటూ ఆ పేదగుండె పెద్ద మనిషి జేబులు తడిమి డబ్బు తీసి ఇచ్చాడు

“నీ అన్నను లేవ తీద్దాం పట్టు. నా కా జబ్బు వస్తే వచ్చిందిలే ఇంత కష్టంలో వున్నవాడిని వదిలేసి ఎల్లా వెళ్లను?—”

“వాడు నా అన్న కాడు,” అని బాలరాజు మాట కడ్డం వచ్చాడు.

“నీ అన్న కాడూ?”

“చూడండి బాబూ! నా సొంత తమ్ముడు కూడా నేను కష్టాల్లో వుండగా ఎల్లా అబద్ధా లాడుతున్నాడో! ఇంత కాలం వీణ్ణి నా రెక్కల మీదే పెంచానండి. ఇప్పుడు చూడండి ఏమంటున్నాడో?”

“అదేమి టబ్బాయ్, నీ అన్న ప్రమాదంలో వుండగా అలా తప్పించుకో చూస్తావేం? నీకు సిగ్గులేదూ? పాపం ఎంత బాధపడుతున్నాడో— అతడు నీఅన్న కాకపోతేమరెవరు?”

“గజదొంగ, మాయలమారి. నా మాట నమ్మకం లేకపోతే నీ జేబులు చూసుకో. నువ్వు నాతో మాట్లాడుతున్నప్పుడే నీ జేబు కత్తిరించి ఖాళీ చేశాడు—”

బాలరాజు మాట పూర్తి చెయ్యకముందే హ్యూగో లేచి వళ్లు దులుపుకుని దౌడు తీయడం ప్రారంభించాడు వాడి వెనక పేదగుండె పెద్దమనిషి కూడా పట్టుకోవాలనే ఆదుర్దాతో పరిగెత్త సాగాడు బాలరాజు తనకు విముక్తి లభించినందుకు దేవుడికి ధన్యవాదాలర్పించి మరోదిక్కుకు పలాయనం చిత్తగించాడు. గ్రామం దాటి, దట్ట

మైన ఒక కీకారణ్యంలో జొరబడే వరకూ అతడు వెనుదిరిగి చూడలేదు. కొన్ని గంటలసేపు అలాగే నడిచినడిచి, సాయంత్రమయ్యేసరికి అరణ్యం దాటేశాడు. బాగా ఆకలవుతున్నది. ఒక రైతుఇంటిదగ్గర ఆగాడు. అతడు నోరు తెరిచి అడగకముందే ఇంటివాళ్లతన్ని తరిమేశారు. అతని బట్టలు చూసి దొంగవెధవనుకున్నారు వాళ్లు కూడా.

బాలరాజుకు ఆకలితో పాటు కోపం కూడా చురుకెక్కుతున్నది. ఈసారి ఎవరైనా తనను అవమానిస్తే సహించరాదని నిశ్చయించుకున్నాడు.

చీకటి పడింది. చలిగాలి సాగింది. బాలరాజు కాళ్లీడ్చుకుంటూ నడవలేక నడవలేక నడుస్తున్నాడు. కాళ్లరిగిపోయాయి. చీకట్లో దారీ తెన్నూ తెలియడం లేదు. గాలిలో గుసగుసలు వినిపిస్తున్నాయి గాని ఒక్క ప్రాణీ కనిపించడం లేదు. దూరాన ఏదో వెలుగు కనిపించడం దగ్గిరికి పోతే ఏమీ లేకపోవడం—ఇదంతా చూసి ఆ పసివాడు గుబగుబలాడిపోయాడు. ఇంగ్లండు దేశానికి ఏకచ్ఛత్రాధిపతి అయినా అతనికి ఈ రోజున ఆశ్రయమిచ్చి ఆదరించే దిక్కు లేకపోయింది.

కీచురాళ్లు 'గీ' మని రొద చేస్తున్నాయి. గుడ్లగూబలు భయంకరంగా అరుస్తున్నాయి. ఎక్కడో గొర్రెల మువ్వలు కదిలినట్టు, కుక్కలు బౌ మన్నట్టు అస్పష్ట శబ్దాలు వినిపించాయి. మనుషులు గుసగుస లాడుతున్నట్లు ఎండిన ఆకులు సవ్వడి చేశాయి.

కొంతసేపటికి ఒక చిన్న ఇల్లు కనబడింది. అది ఎవరిదో రైతుల ఇల్లు. ఇంటికి ఒక పెడగా ధాన్యం గాదె ఉన్నది. దాని చాటున బాలరాజు దాగాడు. గాదెలో ఇద్దరు కూలీలు దీపం పెట్టుకుని ఏదో పని చేస్తున్నారు. దీపం వెలుగులో ఇంటి వెనకభాగాన గల పశువుల కొట్టం కనిపించింది. కూలీల కంట పడకుండా బాలరాజు మెల్లిగా నీడల్లో పాకుతూ కొట్టంలో ప్రవేశించాడు. ఇంటివెనక అరుగుమీద పడేసి ఉన్న కంబళీ నొకదాన్ని తీసికొన్నాడు. పశువుల కొట్టం గాఢాంధకారంగా ఉన్నది. చీకట్లో తడుములాడడంలో పోయి పోయి గడ్డి కుప్పమీద పడ్డాడు. వెచ్చటి గడ్డిమీద కంబళిని కొంతపరిచి, కొంత కప్పుకున్నాడు. పైన ఇంకా కాస్త గడ్డి కప్పుకున్నాడు. ధాన్యం గాదెలోని కూలీలు వాళ్లపని పూర్తయ్యాక వెళ్లిపోతూ పశువులకొట్టం గేటుకూడా మూసిపోయారు. అందుచేత బయట ఎంత చలిగా ఉన్నా లోపల వెచ్చ వెచ్చగానే ఉన్నది. బాలరాజుకు ఒక మూల ఆకలి దహిస్తున్నది; మరొకమూల నిద్ర ముంచుకొస్తున్నది. చివరికి నిద్ర ఆకలిని జయించింది. పగలు పరిగెత్తి పరిగెత్తి అలిసిఉన్నాడేమో సులువుగా నిద్రమైకానికి లొంగిపోయాడు.

ఇంతలో ఎవరో తన్ను తాకినట్టయింది. బాలరాజు ఉలికిపడి కళ్లు తెరిచాడు. అతనిభయం వర్ణనాతీతం. ఆ ఏకాంత అంధకారంలో ఎవరిదో తెలియని ఆస్పర్శ అతన్ని భయవిహ్వాలుణ్ణి చేసింది. చెవిఒగ్గి విన్నాడు ఏదైన శబ్దం వినిపిస్తుందేమోనని. అంతా నిశ్శబ్దం. అలాకాసేపు భయంతో మేలుకున్న తర్వాత అతనికి తెలియకుండానే నిద్రమైకం కమ్మింది. ఇంతలోమళ్లీ ఎవరో తాకినట్టయింది. భయం ముప్పిరిగొని ముచ్చెమటలు పోశాయి. శరీరం ఆపాదమస్తకం ఝల్లుమంది. చీకట్లో కన్ను పొడుచుకున్నా ఏమీ కనిపించడం లేదు. అది నిజంగా చీకటేనా? దెయ్యాలు జుట్టు విరబోసుకున్నాయా? ఏం చెయ్యాలి! అదీ ప్రశ్న. అవతలకు పారిపోతే? ఎల్లా? తలుపువేసేసి వుందిగద. ఇంకో మూలకిపోయి పడుకుంటే? ఆ దెయ్యం అక్కడికి మాత్రం రాదూ? ఈ నాలుగు గోడలమధ్య జైలులో ఆ దెయ్యం తన్ను పీకనులిమి చంపేస్తే! ఇంతకీ అది దెయ్యమేనా? చెయ్యి జాచి చుట్టూ తడుముదామనుకున్నాడు. కాని ధైర్యం చాలలేదు. మూడుసార్లు చెయ్యి కొంచెం జాచాడు. మళ్ళీ జవ్వున వెనక్కి లాక్కున్నాడు ధైర్యం చాలక. నాలుగోసారి మళ్లీ చెయ్యి ఇంకొంచెం ముందుకు పోనిచ్చాడు. అకస్మాత్తుగ్గా చేతికేదో వెచ్చగా, మెత్తగా తగిలింది. గభాలున చెయ్యి వెనక్కు లాక్కున్నాడు. నిలువునా

వణకిపోయాడు చలిజ్వరం వచ్చిన వాడిలాగ. అదేదో కొత్తగా చచ్చినమనిషి శవమై ఉంటుందనుకున్నాడు అందుకనే ఇంకా వెచ్చగాఉంది. అలా ఆరాత్రంతా శవం పక్కన గడపడం దుర్భరం కాదా? ఏం చెయ్యాలి?

అతనికి తెలియకుండానే చెయ్యి మళ్లీ ఆవస్తువు దగ్గిరికి పోయింది వెనక్కు లాక్కుందా మనుకున్నా చెయ్యి లాక్కోలేకపోయాడు ముందు వెంట్రుకలగుత్తి చేతికి తగిలింది. ఇంకా పైకి పోనిచ్చాడు వెచ్చటి తాడు చేతిలోకి వచ్చింది చెయ్యి ఇంకా పోనిచ్చాడు — వెచ్చగా కాళ్లు డొక్కలో పెట్టుకుని అమాయకంగా పడుకున్న ఆవు దూడ!! అతడు పట్టుకున్నది తాగు కాదు. దూడతోక. ఆతోకే రెండుసార్లు అతన్ని స్పృశించింది

బాలరాజు తన భయానికి సిగ్గుపడ్డాడు "నిద్రపోతున్న దూడతోక తగిలినందుకే భయపడ్డాను, ఏం మనిషిని," అనుకున్నాడు వెంటనే ఇలా గనుకున్నాడు "నేను దూడతోకకి కాదుగా భయపడింది అది ఏదో తెలియకనే భయపడ్డాను"

అది మరేమీ కాక దూడే అయినందుకు బాలరాజు సంతోషించాడు అంతేకాదు ఆ ఒంటరితనంలో దూడలాంటి సాధు ప్రాణి తనకు తోడుగా దగ్గిరసా పడుకోవడం అతనికి ధైర్యమిచ్చింది. స్వజాతీయులైన మానవులు అతన్ని పురుగుని చూసినట్టు చూశారు, కొట్టారు, తిట్టారు, తరిమారు, ఉరి తీశారు, అవమానించారు మానవులని పేరుపెట్టుకున్న వారికంటే ఈ అమాయక సాధు జంతువు ఎన్నోరెట్లు నయంగాదా!

వెచ్చని దూడ శరీరాన్ని నిమురుతూ ఇలా ఆలోచిస్తున్నాడు. అతనికోమంచి ఆలోచన తట్టింది వెంటనేలేచి కంబళీ దూడపక్కను జరుపుకున్నాడు దూడవీపును కావలించుకుని కంబళీ దానికూడా కప్పాడు ఇప్పుడు బహువెచ్చగా, సుఖంగాఉన్నది దాదాపు వెస్టుమిన్‌స్టర్ కోటలో మెత్తని పరుపుల మీద పడుకున్నంత హాయిగా ఉన్నది.

ఈహాయితో మధురమైన భావాలు రాసాగాయి జీవితం కేవలం చిత్తమయం కాదనిపించింది. దొంగల ముఠా నుండి తప్పించుకోవడమనేది మొదటి ముఖ్యమైన శుభవిషయం రెండోది, పశువుల కొట్టమైతేనేంగాక ఆశ్రయమంటూ దొరికింది మూడోది, జంతువైతేనేంగాక ఒక ప్రాణి తోడుగా తన






కంబళీలో పడుకున్నది ఇంతకంటే వేరే ఆనందించ దగినదే మున్నది అదుర్భర పరిస్థితుల్లో?

అర్ధరాత్రి దాటింది చలిగాలి జోరెక్కువైంది గాలి కొంతసేపు వ్యాధిగ్రస్తుడిలాగ మూలిగింది, కొంతసేపు హోరున సముద్రంలాగ ఘోషించింది, 'గచ్చుమీద సేనారేకు గీచినట్లు 'గీ' పెట్టింది, కొంతసేపు నక్కల ఊళని అనుకరించింది. అయితే నేం, ఇదంతా బాలరాజుకు శ్రావ్యమైన సంగీతం లాగ వినిపించింది బయటగాలి మొరగనీ, ఉరమనీ, కోప్పడనీ,తిట్టనీ,ఏడవనీ,అతడు హాయిగా పడుకున్నాడు, నిద్రలో మైమరచి పోయాడు, కలల్లో ఇంగ్లండు రాజయ్యాడు,శత్రువులను శిక్షించాడు, పాతశాసనాలు రద్దుచేసి కొత్తశాసనాలు చేశాడు

దూరంగా కుక్కలు మొరిగాయి,గుడ్లగూబలు గోల్లుమన్నాయి, గాలి ఏడ్చింది, వానజల్లు ప్రారంభమై ఒకటే రొద చేసింది ఇంగ్లండు సార్వభౌముడు పశువుల కొట్టంలో కలలు కంటున్నాడు ఆవుదూడ కూడా దర్జాగా కంబళీలో దూరి నిద్రపోయింది కోట్లాది ప్రజలకు ప్రేమపాత్రుడు, కనుసన్నలో ఒక దేశపు యావత్తు జీవితాన్ని పరిపాలించగల సమర్థుడు, రాజవంశీకుడు, మహారాజు అయిన ఎడ్వర్డు ఒట్యూడర్ తన ప్రక్కన పడుకున్నాడని దానికేం తెలుసు?

## 21

పొద్దున బాలరాజు లేచి చూసుకునే టప్పటికి అతని దుప్పటి ముసుగులో ఎలిక పిల్ల ఒకటి పడుకునుంది అతను కదలగానే అది తుర్రున పారిపోయింది. మానవులచేత నిరాదరింప బడిన తన్ను జంతువులు ఆదరించడం చూసి అతనికి దిగులూ, సంతోషమూ కూడా కలిగాయి.

తలుపు దగ్గిర పిల్లలనవ్వులు, మాటలు వినిపించాయి బాలరాజు లేచి సరిగ్గా కూర్చున్నాడు తలుపు తెరుచుకుంది ఏడెనిమిదేళ్ల బాలికలిద్దరు నవ్వుకుంటూ లోపలికొచ్చి బాలరాజును చూసి ఉన్నచోటనే ఆగిపోయారు. అతన్ని తేరిపార చూశారు ఒకళ్ల చెవిలో ఒకళ్లు ఏదో గుసగుస లాడారు కొంచెం నిబ్బరించుకొన్నాక బిగ్గిరిగానే మాట్లాడసాగారు

"అతని మొహం ఎంత అందంగా ఉందో!"

"జుట్టు ఎంత బావుందో!"

"పాపం చిరుగుగడ్డలు తొడుక్కున్నాడు."

"చాలా ఆకలి మీదున్నాడల్లే వుంది"

కొద్దిగా సమీపించారు భయపడుతూ కాస్త కాస్త దగ్గిరికి జరిగారు. బాల రాజును వింతజంతువును చూసినట్లు ప్రతి కోణం నుంచీ ఎరీక్షగా చూశారు కాని మీదబడి కరుస్తాడేమో నన్నట్లు జాగ్రత్తగా దూరంగానే నుంచున్నారు ఆఖరికి ఎదురుగా వచ్చి ఒకళ్ల నొకళ్లు గట్టిగా పట్టుకుని నిలబడ్డారు ఒకపిల్ల ధైర్యం చిక్కబట్టుకుని అమాయకంగా అడిగింది.

"ఎవరబ్బాయ్ నువ్వు?"

"నేను మహారాజును"

బాలికలు అదిరి పడ్డారు.

"ఏ రాజువు?"

"ఇంగ్లండు మహారాజును."

బాలికలు ఒకళ్ల మొగాలు ఒకళ్లు చూసుకున్నారు బాలరాజును తేరిపార చూశారు, మళ్ళీ ఒకళ్ల నొకళ్లు చూసుకున్నారు.

"విన్నావుటే మార్జీ? మహారాజుట నిజమే అయివుంటుందా?"

"నిజమే అయివుండాలి ప్రిస్సీ! అబద్ధ మెందుకు చెబుతాడు? ఎందుకంటే ప్రిస్సీ, నిజం కాకపోతే అబద్ధమౌతుంది నిజాలు కానివన్నీ అబద్ధాలే అందుకని అతనన్నది నిజమే అయివుండాలి"

బలేతర్కం ఈవాదానికి తిరుగులేదు మార్జీ సమాధానంవిని ప్రిస్సీ సందేహాలు ఎగిరిపోయాయి, ప్రిస్సీ కాసేపాలోచించింది, బాల రాజు నడిగింది మళ్ళీ

"నువ్వు నిజంగా మహారాజువే అయితే నువ్వు చెప్పింది నిజమే అయివుండాలి,"

"నేను నిజంగా మహారాజునే"

దీంతో ప్రిస్సీ మనస్సు కుదటపడింది. సందేహాలన్నీ నివృత్తి అయి పోయాయి అతడు మహారాజే నని నిశ్చయమైంది అందుకని "ఇక్కడికెలావచ్చావు? నీకింత కంటె మంచి బట్టలు లేవా? ఎక్కడికెడుతున్నావు?" అని భోగట్టా చేశారు తనసొదను వేళాకోళం చెయ్యకుండా వినేవాళ్లు ఇంత కాలానికి దొరికినందుకు బాల రాజుకు పరమానందమైంది. తన కథంతా ఏకరువు పెట్టాడు తనుపడ్డ కష్టాలన్నీ పూసగుచ్చినట్లు చెప్పాడు.

రెండు రోజులనుంచీ అన్నమే తినలేదన్నాడు. ఇదివిని వాళ్లకి కడుపు చెరువయ్యేంత దుఃఖం వచ్చింది అతన్ని చెయ్యిపట్టకుని గబ గబ ఇంట్లోకి లాక్కుపోయారు

బాలికల తల్లికూడా కుర్రవాణ్ణి ఆదరించింది. ఆమె వితంతువు, కష్టాలు ఎలా ఉంటాయో బాగా ఎరిగి ఉండటంవలన తమ లాంటి పేదవారిని చూస్తే ఆమె కెంతో జాలి అందులోనూ మనవాడి "పిచ్చి" ధోరణిచూసి ఇంకా జాలిపడింది "ఇతడెవరో తన వాళ్లనుండి తప్పిపోయినాడల్లే వుంది," అనుకున్నది అందుచేత అతని ఆరాలన్నీ తియడానికి ప్రయత్నించింది. మళ్ళీ వాళ్ల వాళ్లకతన్ని అప్పజెప్పాలని ఆమె అభిప్రాయం చుట్టుపక్కల ఊళ్ల పేర్లు, పట్నాలపేర్లు చెప్పి చూసింది. కాని అతడా పేర్లే ఎప్పుడూవిననట్లు ఉరుకున్నాడు ఆమె ఒక పక్క వంటచేస్తూనే ఇతనితో మాట్లాడుతోంది గొల్లల పిల్లడేమోనని గొర్రెల విషయం ఎత్తింది సాలెవాళ్ల బ్బాయేమోనని బట్టల నేత విషయం ఎత్తింది వడ్రంగం, కమ్మరిపని, వ్యవసాయం మొదలైన ఎన్నో వృత్తులను సంభావణలోకి రానిచ్చింది కాని బాలరాజు దేనిలోనూ ఆసక్తి చూపలేదు ఒకవేళ ఎవరిఇంట్లోనన్నా పాలేరేమో నని పాలేళ్లుచేసే పనులన్నీ చెప్పి చూసింది ఊహు బాలరాజు కిమ్మనకుండా కూర్చున్నాడు

ఆఖరికి ఆమె వంటవిషయం మాట్లాడింది. వెంటనే అతనిముఖం వికసించింది ఆకలితో గోషు గోషు మంటున్నాడేమో, వంట పేరెత్తగానే అతడు ఎక్కడలేని ఉత్సాహము చూపించాడు. రకరకాల తినుబండారాలనుగూర్చి చాలసేపు ఉపన్యసించాడు. కనుక ఇతడెక్కడో వంటవాళ్ల దగ్గిర అపీఇపీఅందించేవాడుగా పనిచేసి ఉండాలని ఆమె నిర్ధారణ చేసుకున్నది కాని అతడు పేర్కొన్న తినుబండారాలన్నీ ధనవంతుల ఇళ్లలో ఉపయోగించబడేవేగాని సామాన్యుల ఇళ్లలోవి కాదు మరి ఇతడుచూస్తే నిరుపేదలాగాఉన్నాడు. బహుశా పిచ్చెక్కకముందు రాజుగారి వంటశాలలో పని చేశాడేమో పిచ్చెక్కిం తరవాత ఇతన్ని వెళ్లగొట్టి ఉంటారు. అందుచేత తను మహారాజునని వాగుతున్నాడు అయినా ఇంకా పరీక్షించి చూడాలనుకున్నదామె

"ఇప్పుడే వస్తాను. కాస్త ఈకోడిగుడ్లు పగలగొట్టి అట్లువెయ్యి," అని చెప్పి తను అవతలకు వెళ్ళింది తల్లివెంట పిల్లలు గూడా అవతలకు వెళ్లారు.

బాలరాజు ఇలాగొణుక్కున్నాడు. "పూర్వం ఆల్ఫ్రెడ్ అనే ఇంగ్లీషు రాజుకుకూడా ఇలాంటి అవస్థే పట్టింది ఆల్ఫ్రెడ్ లాంటివాడే చేసినప్పుడు నేను మాత్రం వంటచేస్తే తప్పేముంది? అయితే అతనిలాగా పదార్థాలు పాడుచెయ్యను "

కోడిగుడ్లు పగలగొట్టి అట్లు వేశాడు. అతని ఆలోచనలు రాజ్య వ్యవహారాల మీదికి పోయాయి. యజమానురాలు తిరిగివచ్చే సరికి అట్లునల్లగా బొగ్గయి వూరుకుంది ఇది చూసి బాలరాజు గాబరాపడ్డాడు కాని యజమానురాలేమీ అనలేదు. ఇతనికి వంట బొత్తిగా చేతకాదని నిర్ధారణ చేసుకుని పొయ్యి దగ్గిర తనేకూర్చుని వంట పూర్తిచేసింది.

తరవాత ఆమె భోజనానికి బల్ల, కుర్చీలు సిద్ధంచేసింది. బాలరాజుకు బిచ్చగాళ్లకుపెట్టినట్టు వీధివసారాలో పాతగిన్నెల్లో భోజనం పెడదామనుకుంది కాని బాలరాజు ఎవరి అనుమతీలేకుండానే తనంతటతనువచ్చి ఒకకుర్చీ న్నాక్రమించాడు ఇక యజమానురాలేమీ అనలేకపోయింది. అందరితోపాటు ఈ "బిచ్చగాళ్ల అబ్బాయి"ని కూడా కూర్చోనిచ్చింది.

వేరే పరిస్థితుల్లో అయితే బాలరాజు మిగతావాళ్లు తనతోపాటు కూర్చున్నందుకు పేచీపెట్టేవాడే. కాని ఇప్పుడేమీ అనలేకపోయాడు. ఎందుకంటే బాగా ఆకలి దంచేస్తోంది. పేచీపెట్టుకోడానికి తగిన ఓపికలేదు అదీగాక, ఇందాక తనుకోడిగుడ్లట్టు మాడ్చినందుకు ఊరికే ఇదవుతున్నాడు తను తప్పు చేసినా యజమానురాలు దయతో ఏమీ అననందుకు ఆమె నతడు అభినందించాడు అందువల్లకూడా వాళ్లు తనపక్కన కూర్చోవడం సహించాడు.

(41-వ పేజీ చూడండి)



# ఎత్తుకుపైఎత్తు

శ్రీ వి. ల. నరసింహాచార్య

ఒక గ్రామంలో ఒక షావుకారుండేవాడు అతను బలేజితులమారి ఎంత అపాయాన్నయినా సులువుగా తప్పించుకుంటాడు

ఆ వూరికి చుట్టుపక్కల బస్తీ ఏదీ దగ్గరలో లేదు సరికదా!- రెండో కోమటిల్లుకూడా ఆ వూళ్లో లేదు అందువల్ల ఎంత ప్రియమైనా ఆ అంగట్లో నేకొనుక్కోక తప్పేది కాదు

ఒకరోజు ఒక కాపు ఆ అంగడికొచ్చాడు వచ్చేకాపును వినవు నవ్వుతో — "ఏమోయ్! ఏంకావాలి? - త్వరగా కానీయ్!" అన్నాడు కాపు — "నాకా! చింతపండు కావాలండి! వీశ ఎంత?" అని అడిగాడు

"ఆ! ఎంతలే - రూపాయిబేడ!" అన్నాడు షావుకారు

"సరే! అయితే - ఓ వీశడియ్యండి! అని కూచున్నాడు

షావుకారు లేచి, అటకమీదనున్న చింతపండు దించి, వీశెడు తూచి కాపుకిచ్చి "మూడురూపాయిల ఆరణాలు" యిమ్మన్నాడు

పాపం! కాపు గాభరాపడి "వీశ చింతపండు రూపాయిబేడని, మూడు ఆరణాలిమ్మంటావేం?" అని అడిగాడు సెట్టినవ్వుతూ - "నేను అటకమీదినుంచి తీసిందెంత?" అన్నాడు

"వీశ" అన్నాడు కాపు

"తూచిందెంత?" అన్నాడు షావుకారు

"వీశ" అన్నాడు కాపు దీనంగా

"తూచి నీకిచ్చిందెంత" న్నాడు శెట్టి

"వీశ" అన్నాడు కాపు నీరసంగా-

"ఇంకేం! మూడువీశలకూ - మూడురూపాయిలారణాలు చెల్లించుకో" అన్నాడు కపటపు నవ్వుతో -

కాపుబుర్రలో రైళ్లు పరుగెత్తినయ్ చటుక్కున ఓ చిన్న ఆలోచన తట్టింది -

వెంటనే రొండినుండి రూపాయి బేడ తీసి షావుకారుకిచ్చాడు కాపు

"ఇదేమిటి? రూపాయిబేడ యిచ్చావ్?" అన్నాడు శెట్టి

"అదిగల్లాలో వుంచు చెప్తా! నేనింటినుండి తెచ్చింది ఎంత?-" అన్నాడు కాపు

"రూపాయిబేడ" అన్నాడు శెట్టి



# ఎత్తుకు పై ఎత్తు

శ్రీ చి. ల. నరసింహాచార్య

ఒక గ్రామంలో ఒక షావుకారుండేవాడు అతను బలేజితుల మారి ఎంత అపాయాన్నయినా సులువుగా తప్పించుకుంటాడు

ఆ వూరికి చుట్టుపక్కల బస్తీ ఏదీ దగ్గరలో లేదు సరికదా!- రెండో కోమటిల్లుకూడా ఆ వూళ్లో లేదు అందువల్ల ఎంత ప్రియమైనా ఆ అంగట్లో నేకొనుక్కోక తప్పేది కాదు

ఒకరోజు ఒక కాపు ఆ అంగడి కొచ్చాడు వచ్చేకాపును వినవు నవ్వుతో— "ఏమోయ్! ఏంకావాలి? - త్వరగా కానీయ్!" అన్నాడు కాపు — "నాకా! చింతపండు కావాలండి! వీశ ఎంత?" అని అడిగాడు

"ఆ! ఎంతలే - రూపాయిబేడ!" అన్నాడు షావుకారు

"సరే! అయితే - ఓ వీశెడి య్యండి!" అని కూచున్నాడు

షావుకారు లేచి, అటకమీద నున్న చింతపండు దించి, వీశెడు తూచి కాపుకిచ్చి "మూడురూపాయిల అరణాలు" యిమ్మన్నాడు

పాపం! కాపు గాభరాపడి "వీశ చింతపండు రూపాయి బేడని, మూడు అరణాలిమ్మంటావేం?" అని అడిగాడు సెట్టినవ్వుతూ - "నేను అటకమీదినుంచి తీసిందెంత?" అన్నాడు

"వీశ" అన్నాడు కాపు

"తూచిందెంత?" అన్నాడు షావుకారు

"వీశ" అన్నాడు కాపు దీనంగా

"తూచి నీకిచ్చిందెంత" న్నాడు శెట్టి

"వీశ" అన్నాడు కాపు నీరసంగా-

"యింకేం! మూడువీశలకూ - మూడురూపాయిలారణాలు చెల్లించుకో" అన్నాడు కపటపు నవ్వుతో -

కాపుబుర్రలో దైళ్లు పరుగెత్తినయ్ చటుక్కున ఓ చిన్న ఆలోచనతట్టింది -

వెంటనే రొండినుండి రూపాయి బేడ తీసి షావుకారుకిచ్చాడు కాపు

"ఇదేమిటి? రూపాయి బేడ యిచ్చావ్?" అన్నాడు శెట్టి

"అదిగల్లాలో వుంచు చెప్తా నేనింటినుండి తెచ్చింది ఎంత?-" అన్నాడు కాపు

"రూపాయిబేడ" అన్నాడు శెట్టి

## రాజూ-పేదా

(39 వ పేజీ తరువాయి)

మొత్తానికి ఇరుపక్షాలవారూ చాల ఉదారంగా ప్రవర్తించామని తమ్ముతామే ప్రశంసించుకున్నారు.

భోజనానంతరం యజమానురాలు అంటుగిన్నెలు తోమమని బాలరాజుకు పురమాయించింది. ఈ పురమాయింపుకు అతడు నిర్ఘాంతపోయాడు. ఎదురుతిరుగుదామనుకున్నాడు కాని మళ్లీ తమాయించుకున్నాడు. "పూర్వం ఆల్ఫ్రెడ్ రాజు వంట చేశాడు. బహుశా గిన్నెలుకూడా తోమే ఉంటాడు. కనుక నేను చేసేమాత్రం తప్పేమిటి?" అనుకున్నాడు.

గిన్నెలమసి నీళ్లతో వదిగితే పోదా అనుకున్నాడు కాని ఎంతసేపు తోమినా చేతులరిగాయిగాని మసిపోలేదు. ఏదోవిధంగా ఆ పని పూర్తిచేశాడు. ఇక త్వరగా ఇక్కడనుండి బయటపడదామనుకున్నాడు కాని యజమానురాలు బంగాళదుంపల చెక్కులు తీయమని మళ్ళీ పురమాయించింది. విసుక్కుంటూ బాలరాజు ఆ పనికూడా ప్రారంభించాడు కాని అతడు చెక్కులు తీసిన బంగాళదుంపలన్నీ గోలీకాయల్లాగ తయారవుతున్నాయి. సమయానికి యజమానురాలు అడ్డపడి మిగతా బంగాళదుంపలు ధ్వంసం కాకుండా రక్షించుకుంది. తరవాత కత్తిపీట పదును పెట్టమని పురమాయించింది. అదయింతరవాత నూతిలోంచి నీళ్లు తోడమన్నది. సుకుమారుడైన బాలరాజు ఈ కాసిని పనులతోనే పూర్తిగా అలిసిపోయాడు. తన పూర్వీకుడైన ఆల్ఫ్రెడ్ ఏర్పరచిన ఆనవాయితీని దాటిపోతున్నానని భయపడ్డాడు. మధ్యాహ్న భోజనంకూడా చేసేచ్చాడు. ఇక వెళ్లిపోదామనుకున్నాడు. అయితే చెప్పివెళ్లడమా, చెప్పకుండా వెళ్లడమా అని సమస్య కలిగింది.

ఇంతలో యజమానురాలు తడిబట్టలు దొడ్లో ఆరవెయ్యవలసిందని మూట తీసుకొచ్చి అప్పగించింది. ఆమె లోపలికి పోగానే ఇదే సమయమని వీధివాకిట్లోకి వచ్చాడు.

వాకిట్లో అడుగుపెట్టాడోలేదో పదిపదిహేను గజలదూరంలో జాన్ కాంటీ, హ్యూగో ఎదురయ్యారు. జాన్ కాంటీ సరుకులమ్ముకునేవాడి వేషంలో వున్నాడు. హ్యూగో నెత్తిమీద సరుకుల సంచి వున్నది. అదృష్టవశాత్తు వాళ్లు తలలువంచి మాట్లాడుకుంటూ వస్తున్నందువల్ల బాలరాజును చూడలేదు. బాలరాజు గిరుక్కున వెనక్కి తిరిగి దొడ్లో ప్రహారీగోడ దూకి కాలినాట్టు ఉడాయించాడు.



(ఇంకావుంది)

"నా గొండిలోంచి తీసిందెంత?" అన్నాడు కాపు

"రూపాయిబేడ" అని చెప్పాడు శెట్టి

"నీకిచ్చిందెంత?" అని అడిగాడు కాపు

"రూపాయిబేడ" అని చెప్పాడు శెట్టి. "నీ విచ్చినపండుకూ - నే నిచ్చిడబ్బుకూ ! సరిపోయేనూ - !" అని తుర్రుమన్నాడు కాపు

తన ఎత్తుకు పై ఎత్తువేసిన కాపుమీద కారకార శెట్టికంతవరకూ పోలా!



## "సిండరెలా"

పై వారంనుంచీ ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో "సిండరెలా" బొమ్మల కథ ఆరంభమవుతున్నది. ప్రఖ్యాత కార్టూన్ చిత్రనిర్మాత అయిన వాల్ట్ డిజ్నీ తయారు చేసిన చిత్రంనుంచి ఈ బొమ్మలు తీసుకొంటున్నాము

—సంపాదకుడు

---

భర్త ఈ డ్రైవరును పంపించెయ్యాలిసిందే. ఇవాళ మళ్లీ నన్ను హత్యచేసినంత పని చేశాడు

భార్య పాపం, ఇంకొక్కసారి చూద్దురూ.

# జాలరి యుక్తి

(32-వ పేజీ తరువాయి)

నేను సాల్మన్ రాజునకు సేవకుడను వాడు దేవదూతకుమారుడు వాడు నాకు శ్రమ కల్పించుచుండుటచే నేను వాడిని ఎదుర్కొంటిని అంతట వాడు కోపించి నన్ను ఒక చిన్న బిందెలో బంధించి నదిలో పారవైచెను నేను ఆ విధముగా నాలుగు శతాబ్దము లుంటిని మొదటి శతాబ్దమున నన్ను ఎవరేని విడుదలచేసినవారిని భాగ్యవంతునిగా జేయదలచితిని. కాని ఆ విధముగా జరగలేదు. రెండవ శతాబ్దమున నన్ను విముక్తి కలిగించువారిని భూమండలమున నుండు నిధులన్నిటని చేకూర్చెదనని తలచితిని కాని దానికిని విముక్తి కాదాయె మూడవ శతాబ్దమున నన్ను విడుదల కావించువారిని చక్రవర్తినిగా జేసి, దినమునకు మూడు కోర్కెలను తీర్చుటకై నిశ్చయించుకొంటిని అందులకును విడుదల కాదాయె అంత నా కోపావేశముతో ఇక నన్ను ఎవరైనసరే విడుదల కావించువారిని సంహారించెద నని ప్రతిజ్ఞ చేసితిని," అని తన కథను ముగించి, 'నేడు నా ప్రతిజ్ఞప్రకారము సంహారించెద' నని పలికెను

జాలరి ఏమీ తోచక లోలోన దుఃఖించుచుండగా అతనికిఆలోచన ఒకటి మనసునకు వచ్చెను అంతట జాలరి వినయముతో— "ఓ పిశాచమా! నేను ఇపుడు చావుకు దుఃఖించుటలేదు కానీ నా దొక మనవి. నా కోరిక తీరినపిమ్మట నీ యిష్టప్రకారము చంపు" 'ఈ బిందె చాల చిన్నది నీ ఆకారము బహుగొప్పది నీవెట్లు ఈ బిందెలో నుంటివి? నాకు చాల వింతగా నున్నది' అని అడగగా

పిశాచము 'ఓరీ! తెలివి తక్కువ పక్షీ నేనీ బిందెలోనుండుట నీకు వింతగా నున్నదా అయిన చూడు నే నెట్లు ఆ బిందెలో జొరబడెదనో" అని వాడంతట పొగగా మారి బిందెలో చేరెను బిందెలో చేరుటేతడవుగా జాలరి దానిమూతి చెను సీసముతో బిగించినపిమ్మట లోనున్న పిశాచముతో 'ఓ పిశాచమా నీ విప్పుడు ఏ విధంగా మరణించుట ఇష్టమో జాగుసేయక చెప్పు, మనెను

అందులకు రక్కసుడు తాను చేసిన తెలివితక్కువ పనికి నిందించుకొనుచు 'ఓ జాలరీ! నన్ను ఇప్పుడు రక్షించిన నీకు సర్వ ఐశ్వర్యములు కలుగునట్లు చేసెద' నని బతిమాలుచుండగా వాడు దానిని యథాప్రకారము నదిలో పడవైచి తన వల మొదలైన సామానులన్నింటిని తీసుకొని తన ఇంటికి వెళ్లెను

బాలురారా! జాలరి తెలివివల్ల ఎంత గొప్పది వాడు తన తెలివి ప్రాణములను రక్షించుకొనెను చూచితిరా! ★



భార్య ఏమండీ, నవ్వుతూ పలకరించిందే, ఆషోకుల డి
మీా కెట్లా తెలుసు?

డాక్టరు వృత్తి ధర్మంగా తెలియటమే.

భార్య ఎవరి వృత్తి?

# రెండురూపాయిలు

(14-వ పేజీ తరువాయి)

యలూ జేబులో వేసుకొని!'' అనుకున్నాడు రామ్మూర్తి

"అవునుగా ఇవాళ సినిమా కెళ్లాం వొస్తారండీ? అందాజ్ట చాలా బాగుందిటండీ!'' అన్నాడు చిట్టిబాబు

రామ్మూర్తి భరించలేకపోయాడు తన డబ్బుపెట్టి ఎన్ని విలాసాలూ! ఎత ధీమాగా ఖర్చుపెట్టడానికి సిద్ధమయ్యాడు - దుర్మార్గుడు!

చివరికెలాగో ఆలోచించుకుని రామ్మూర్తి అన్నాడు

"చిట్టిబాబూ! నీతో ఓ ముఖ్యమైన సంగతి చెప్పాలోయి నువు నన్నివాళ ఎంతగా బాధపెట్టావో నేను చెప్పలేను

చిట్టిబాబు తెల్లబోయి 'అదేమిటండీ అలా అనేసేరు?'

"అనేవలిసొచ్చింది నేను నిజం దాచవలసినవాణ్ణి కాను మొహమాటపడవలసినవాణ్ణీ కాను అందుచేత అలా చెప్పాను నువు ఇకముందైనా మంచి ప్రవర్తనలో పడతావని నా నమ్మకం'

'ఏమిటండీ యిలా మాట్లాడుతున్నారు? కొంపతీసి హాస్యం కాదుగదా!'

'అబ్బె హాస్యంకాదు నిజమే'

"నే నేమిటి చేసేనండీ యిలా మాట్లాడుతున్నారు?

'- నువ్వివాళ ఒక ఘోరమైన పని చేశావోయి దాంతో నాకు మనస్సు విరిగిపోయింది ఇంక అది అతుకోదు

'ఇవాళా? నేనా? - ఏమిటండీ అఘోరమైన పని?'

'ఏమిటో నీకు తెలుసు నాకు తెలుసును మరి చెప్పుకోవడం దేనికి?

'నాకు తెలియదండీ చెప్పకూడదూ?

"ఏమీ లేదు, నువ్వివాళ ఓ ఘోరమైన పని చేశావు దాంతో నా మనస్సు విరిగిపోయింది నిన్ను మరి చేరనియ్యకూడదని నాకు తేలింది ఇక ముందయినా నువు నీ ప్రవర్తన్ని సరిచేసుకుంటే బాగుపడతావు లేకపోతే ఇప్పటికే నీకో చెడ్డపేరుందా? మరీ చెడ్డవాడివైపోతావు'

'ఇప్పటికి మనకి చెడ్డపేరు లేదులెండి - ఒక సంవత్సరం కిందట చిట్టిబాబంటే చెడ్డగుణా లన్నిటికీ పేరుమోసి వుండేవాడు ఇప్పుడవేవీ మనకి లేవు —అడగండి కావలిస్తే ఎవర్నయినా చిట్టిబాబెలాంటివాడూ అని! — మునుపు చెడు తిరుగుళ్లు తిరిగేవాడు గాని ఇప్పుడు బాగుపడ్డాడంటారు"

'కాని ఆ బాగుపడ్డమంతా ఎవరి చలవ?

"నే నొప్పుకుంటానే అంతా మీ దయే మొట్టమొదట మీరు కోవెల చలవరాయిమీద కూచోబెట్టి నే న్చేస్తున్న పన్లు మంచివి కావని చెప్పిన సంగతి మరిచిపోను అనక మీదగ్గిర కొస్తుండడము నా చెడు బుద్ధులు మానియ్యడమూ అంతా అయింది నిజంగా నాకిప్పుడు పరీక్షల్లో బాగా మార్కులొస్తున్నాయంటే మీ దగిర నేర్చుకోవడమే కారణం కాని చెబుదురూ ఇవాళ నే న్చేసిన ఘోరమైన పని ఏమిటో అని'

"ఎందుకు లెదూ!"

"మీరలా ఎందుకనేస్తే నే నొప్పుకోను ఇన్నాళ్లబట్టి నేను చెడ్డ పనన్నది చెయ్యలేదు ఇవాళ మీరిలా అంటున్నారంటే నాకు చాలా దీనిగా వుంది ఏమిటి నే న్చేసిన తప్పు పనీ అని! నిజంగా చేసింది తప్పే అయితే మళ్లెప్పుడూ చెయ్యను ఏమిటి చేసేనో చెప్పండీ!

"ఊహించుకో నీకే తెలుస్తుంది'

'నాకేం తెలియడం లేదు

"కాదు తెలుస్తుంది నువ్వివాళ మాయింటికొచ్చి ఏమిటి చేసేవో అంతా జ్ఞాపకం తెచ్చుకో'

'—ఇవాళా? మీ యింటి కొచ్చేను మీ నాన్నగారు సావిట్లో వున్నారు రామ్మూర్తి గారున్నారా అని అడిగాను లోపలికి వెళ్లి చూడమన్నారు నేను మీ గదిలో కొచ్చి చూసేను మీరు నిద్రపోతున్నారు నేను దేనికని వెళ్లిపోతూ వుంటే మీ రోమాటు ఆయీ ఇయా కదిలేరు లేచేవున్నారుగాబోలని ఓమాటు పిల్చేను మీరు, పలికేరుగాని కళ్లు విప్పలేదు పడుకుంటారు గాబోలు పోనీ మళ్లీ వొద్దామని వెళిపొచ్చేను

'ఇంతేనా? ఇంతకంటె ఇంకేం చెయ్యలేదూ?

"ఇంతేనండీ"

'నిజంగా గాయత్రి సాక్షిగా?

"కాదండీ - నా మనస్సాక్షిగా కూడా చెబుతున్నాను

అయితే నీతో ఇంక ఒక్కమాట కూడా మాట్లాడను పెద్దమనిషి వనుకున్నాను కాని ఇలాటివాడివని అనుకోలేదు' అని గిరుక్కున తిరిగి ఇంటివేపు వచ్చేస్తున్నాడు రామ్మూర్తి

"రామ్మూర్తిగారూ!' అని చిట్టిబాబు పరుగెత్తివచ్చి కలుసుకున్నాడు

'నాతో మరి నువు మాట్లాడకోయ్!'

చిట్టిబాబు నిలబ్బడిపోయాడు, రామ్మూర్తి ఇంటికొచ్చేశాడు అట్నుంచి మామ్మ మెల్లెక్కుతున్నాది ఇట్నుంచి ఇతను మెల్లెక్కేడు ఇద్దరూ ఆ చివర్ని కలుసుకున్నారు

రామ్మూర్తికి ఆశ వదల్లేదు

"మామ్మా! నా బీర్వామీది పెట్టిమీద రెండ్రూపాయలు పెట్టేను మీరుగాని తీసేరా?

మామ్మ నవ్వి "భడవా రెండెక్కడ్రా?" అన్నది

'ఊఁ - హుఁ! రెండ్రూపాయలూ నే పెట్టేనే!

'అదేమో నేను మజ్జాన్నం మేడ మీదికి గావోసు అటొచ్చాను ఆ కిటికీలోంచి రివ్వుని గాలి కొట్టింది ఓ రూపాయనోటు ఎగిరొచ్చి కిందపడ్డది నువ్వు బీర్వామీద పెట్టుకున్నావని అంతకి ముందే మీ నాయినా వినలా అనుకున్నారు అందుకే ఏడిది కావోసని తీసి దాచేను" అన్నది మామ్మ

"అయితే రెండో రూపాయి యేమైనట్టు?" అన్నాడు రామ్మూర్తి బహుశా వాసు దాంతో సోమన్నకీ చిన్నన్నకీ టీపార్టీ జరిపి ఉంటాడని శేషం అణా కానీ అనీ ఓ మాటు అనుకున్నాడు

మళ్ళీ బహుశా ఆ రూపాయి చిట్టిబాబు తీసి మళ్లీకన్ను రామిగాడికిచ్చేశాడేమో

# వివాహము



బాపట్ల వాస్తవ్యులైన శ్రీ శ్రీ డాక్టర్ వేదాంతం బావనారాయణగారి రెండవ కుమారుడు

చి॥ నరసింహదాసుకును

మచిలీపట్నంలో కెమిస్టు, డ్రగిస్టు అయిన శ్రీ వి వి శాస్త్రిగారి జ్యేష్ఠకుమార్తె

చి॥ సౌ॥ విద్యావతికిని

22 6 51 తేదీన కన్యాదాత గృహమున వివాహము జరిగెను బంధుమిత్రులు, పుర ప్రముఖులు అనేకులు వచ్చి వధూవరుల నాశీర్వదించిరి కొన్ని కవిత్వములు చదివించిరి

అనుకున్నాడు అయితే, అతనికి సినిమాకెళ్లానికి డబ్బు ఎక్కడిదీ? వాళ్లమ్మని పీడించి వుంటాడు ఆవిడ యిచ్చి వుంటుంది

"అదేమో గాని నీ రూపాయిగో" అని మామ్మ తిన్నగా యింట్లోకెళ్లి భగవద్గీతలోంచి తీసిచ్చింది

రామ్మూర్తి అనుమానంగా నోటుని నలిపాడు ఆశ్చర్యం! ఆ నోటు రెండు పొరలయింది!

అప్పుడతనికి జ్ఞాపకొచ్చింది అవి రెండూ కొత్త - సరికొత్త - బ్యాంకు నోట్లని తనకా డబ్బిచ్చిన రమణమూర్తి లేడూ, వాళ్ల నాన్న ఇంపీరియల్ బేంకులో పనిచేస్తూన్నాడు! మొన్ననే ముప్ఫయొకటో తారీకు!

"రెండు రూపాయ లేనండీ!" అన్నాడు రామ్మూర్తి

"ఏమిరా?" అన్నది మామ్మ ఆశ్చర్యంగా

ఈలోగా ఇంట్లోవాళ్లందరూ అక్కడ జేరారు అందరికీ జరిగిన కథ విపులంగా ఎంత వీలైతే అంత విపులంగానూ చెప్పాడు అక్కడున్న ప్రతీవ్యక్తికి తనకథ—అనగా తనకీ ఆ రెండురూపాయలకీ ఉన్న సంబంధం—చెప్పడం కూడా జరిగింది ఆ కథలన్నీ వినతగినవి

చిట్టిబాబు వీధిలోంచి కేక వేశాడు రామ్మూర్తి సంతోషంతో వెళ్లాడు

ఎంతో మనస్తాపం వెళ్లగక్కుతూ చిట్టిబాబు అన్నాడు

"మీరెన్నంటే అనండి—నాతో మాట్లాడ్డం కూడా మానియ్యండి కావలిస్తే కానీ నేచేసిన తప్పేమిటో నాకు చెప్పండి ఇవాళ నేనేం చెయ్యలేదుగదా నిష్కారణంగా ఇతన్లాటివాడితో ఫ్రెండ్షిప్పెందుకు పోవాలని నాకు చాలా బాధగా వుంది తన్నయినాసరే, కసిరయినాసరే నాకు తప్పేమిటో చెప్తేగాని వెళ్లను!"

"నీ తస్సా చెక్కా ఆ మాటలన్నీ జ్ఞాపకముంచుకున్నావుటోయి?" అన్నాడు రామ్మూర్తి, నిజంగా ఆ మాటల్ని తను మనస్ఫూర్తిగా అననట్టు

"జ్ఞాపకమేమిటండీ - చాలా బాధగా వున్నది"

"హాఁ! మరిచిపోవయ్యా! ఉత్తినే అన్నాను"

"ఉత్తినే ఎందుకంటారండీ, నాలో తప్పు లేందీ?"

"ఉత్తినే అన్నానయ్యా! నమ్మవంతే"

"నచ్చు, నేన్నమ్మను అంతంత లేసి మాట లుత్తినే యెందుకంటారు? - అయితే నే నోకలా అనుకున్నానండి, నిద్రపోతున్నప్పుడు లేపేను, ఆ తరవాత మరి మీకు నిద్రపట్టలేదు గావోసు అందుకోపగించుకొనుంటారూ అనుకున్నాను ఏం అంతేనా?"

రామ్మూర్తి ఛటుక్కున "అబ్బ నీ తస్సా చెక్కా! యెంత బాగా కనిపెట్టేవోయ్!" అన్నాడు

"లేకపోతే ఉట్టినే అలా అనేస్తారా అనుకున్నాను"

"సరేగాని నీ సినిమా ప్రోగ్రాం ఏమైంది?"

"ఏమిటవడం మీరొస్తే సెకండ్షోకి పోదాం"

రామ్మూర్తి ఏలాటివాడూ అన్నది మనకక్ఖర్లేదు కాని అతను సినీమాకి చిట్టిబాబు ఖర్చుమీద వెళ్లాడు వెళ్లడమే కాకుండా ఆనాటి చరిత్ర ఆలా జరిగినట్టు ఎన్నడూ చిట్టిబాబుకు చెప్పలేదు ఇంట్లో ఎవర్నీ చెప్పవద్దన్నాడు ★

(3-వ పేజీ తరువాయి)

సంగతి మనం జ్ఞప్తికి తెచ్చుకోవాలి - అలా అంగీకరించక గత్యంతరం మాత్రం యేముంది? అంగీకరించకపోతే ప్రత్యామ్నాయా, ముస్లింలీగుకు ప్రత్యేక రాజ్యాంగ నిర్మాణ సభ యేర్పడాలనే ప్రతిపాదన అక్కడ సిద్ధంగానే కనుపించుతోంది అంటే యేమన్న మాట? - అవుయినా గోదానమే ఇవ్వైనా గోదానమే అన్నట్టు పాకిస్థాన్ యేర్పడటం యెట్లాగూ తప్పదనే సంగతి స్పష్టంగా కనుపించుతోంది అందుచేత, గత్యంతరం లేక, కాంగ్రెస్ కార్యవర్గం, బ్రిటిష్ ప్రధాని 6 వ డిశంబరు ప్రకటనను కాబినెట్ మిషన్ వారి వ్యాఖ్యాన పురస్సరంగా అంగీకరించవలసి వచ్చింది

## గాంధిజీ అసహాయత.

ఆవిధంగా, అత్యంత త్వరితగతిని గాంధిజీ తెరమరుగుకు వెళ్లిపోతున్నారు మంత్రులే స్వయంగా యోజించటమూ స్వయం బాధ్యత మీద వ్యవహరించటము జరుగుతోంది

1947 ఫిబ్రవరిలో స్వరాజ్యమిస్తామనే వాగ్దానం జరిగింది జూన్‌లో వ్యవహారం పరిష్కారమైంది అదేవిధంగా, జూన్ నెలతో గాంధిజీకూడా సంపూర్ణంగా పతనమై పోయారు ఎలాగంటే, ఆయన బీహారునుంచి ఢిల్లీకి తిరిగివచ్చిన మొదటి మూడురోజుల్లోనూ (జూన్ 4,5,6 తేదీలు) "దేశవిభజనను నాప్రాణం ఫణంగా బెట్టి ప్రతిఘటించుతా" నని ఉద్ఘాటించారు 7,8, తేదీలలో కాశ్మీర్ వ్యవహారాలను గురించి ప్రస్తావించారు 9 వ తేదీన దేశవిభజన ప్రసక్తి లేకుండా మౌనంగా ఊరుకున్నారు తీరా 10 వ తేదీన, దేశవిభజన ప్రతిపాదనను అంగీకరించమని ప్రజలకు సలహా యిస్తూ దానితో పాటు నాయకులనందరినీ రద్దు చేసివేసుకోమని హెచ్చరించారు ఇక 11 వ తేదీన, కాంగ్రెస్ కమిటీ సమావేశంలో —యెన్నడూ లేని ఆచారం—దేశవిభజన సూత్రాన్ని అంగీకరించుతూ నాయకులకు మద్దతు నివ్వమని, వోటింగుకుముందే తాను ప్రసంగానికి దిగారు

ఈ విషయాల నన్నిటినీ యిప్పుడు యెందుకు త్రవ్వి యెత్తవలసి వచ్చిందంటే తాను అధ్యక్షుడుగా వున్న ఆ సంవత్సరం పొడుగునా, తన ప్రమేయమే లేకుండా యిలాంటి వ్యవహారాలన్నీ ఆయన నెత్తిమీదగా జరిగిపోతుంటే, కృపలానీ యెంతగా బాధపడి వుండవచ్చునో ఊహించటానికి వీలౌతుంది తరవాత, తన మనోవ్యథనంతా కృపలానీ, గాంధిజీతో అనేక పర్యాయములు వెళ్లబోసుకున్నారు రోలు వెళ్ళి మద్దెలతో మొరబెట్టుకున్నట్టు — తనతో పాటు వ్యథితుడౌతున్న ఆయనతో మొరబెట్టుకుని మాత్రం ప్రయోజనమేమిటి? ఆ అసహాయ స్థితిలో, గాంధిజీ, తాను చేయగలిగిందేమీ లేక, అధ్యక్ష పదవికి రాజీనామా దాఖలు చెయ్యవలసిందిగా కృపలానీకి సలహా యిచ్చారు లేదా — రాజీనామా పెట్టాలనుకుంటున్న కృపలానీ అభిప్రాయాన్ని తానూ ఆమోదించారు రాజీనామా దాఖలైంది ఆమోదించబడ్డది కాని దానివల్ల కలిగిన ఫలితమేమీ లేదు కాంగ్రెస్ అధ్యక్షునికి, ప్రత్యేకశాఖను దేన్నీ నిర్వహించే బాధ్యత యేదీ లేకుండా, మంత్రివర్గంలో సభ్యుడుగా వుండేట్టు చేయాలని కూడా ఒకప్పుడు అనుకున్నారు కాని ఆ అభిప్రాయం నాటికీ నేటికీ కూడా అలానే గాలిలో వుండిపోయింది

ఈ రాజీనామా ద్వారా చాలా తీవ్రమైన ఫలితాలను తీసుకు రాగలనని కృప

గారి ఆశించారు కాని కాలానికి కట్టుబడి వేచి వుండవలసి వచ్చింది. ఈ లోగా గాంధీజీ హత్య సంభవించింది అంతఃకల్లోలాలను బయలుదేరదీయటానికి అది తరుణం కాదనుకున్నారు కృపలానీకి తీవ్రమైన విశ్వాసాలున్నయ్, సునిశితమైన ఆత్మాభిమానంగలవాడు, జాతికంతకూ ఏకైక నాయకత్వం వహిస్తున్న మహాసంస్థయొక్క అధ్యక్షునిపట్ల చూపబడిన ఉదాసీనభావానికి వ్యక్తిగతంగానూ, ప్రజాగౌరవదృష్ట్యానూ కూడా చాలా కంటగించుకున్నారు నాటినుంచీ ఈబాధఅంతా ఆయనలో జ్వాలలు రేగుతూనే వుంది జాతియొక్క వోటింగ్ ద్వారా తన నిర్దుష్టతను తాను నిరూపించుకోవటానికి నాటినుంచీ ప్రయత్నించుతూనే వున్నారు 1948-50 సంవత్సరాలలో రెండుదఫాలు అలాంటి ప్రయత్నం చేశారు అలాంటి సవాలుకు 1948 లో కాలం యింకా పరిపక్వం కాలేదు 50 లో ఆ పరిపక్వదశ వచ్చింది నాశిక్ కాంగ్రెస్ పోటీలో ఆయన విజయం, అవంతలో తప్పిపోయింది

అపజయాన్ని పొందిన తరువాత, ఆ యెన్నికల సందర్భంలో జరిగిన సంఘటనలన్నిటిపైనీ విచారణ జరగాలని అభిలషించారు ఇవే శాసనసభల బాపతు యెన్నికలైనట్లయితే కోర్టు కెక్కడమూ, అర్జీలు దాఖలు చెయ్యడమూ, న్యాయస్థానాల ద్వారా ఐసా పైసా తేలిపోవటమూ జరిగేది ఇది అలాంటి వ్యవహారం కాదు గనక కృపలానీ స్వయంగా ఈ జ్వాలను ఆరకుండా ఈనాటికీ కూడా పట్టుకు కూర్చున్నారు ఏదో ఒక సరియైన అవకాశంలో ఒకతూరి యీయన కేంద్ర మంత్రివర్గంలో ఒక స్థానాన్ని ఆక్రమించినట్లయితే పరిస్థితులు యెలా మారేవో మనం ఊహించలేము పి సి ఘోష్ ప్రధానిగా వున్నప్పుడు, కృపలానీని బెంగాలు గవర్నరుగా వెయ్యాలనే ఆలోచన జరిగింది కాని ఆయన దానివంక కన్నెత్తి చూళ్లేదు అలాంటి దానికి అంగీకరించటానికి ఆయన మెత్తబడిపోయి అల్లు కడిగి వేయవలసిన రాజకీయ వేత్తకాడు సతీసమేతంగా కాందిశీక పునరావాస కార్యక్రమాన్ని చేపట్టి అత్యంత దీక్షతో పనిచేశారు

సుచేతా కృపలానీ తన సేవాకార్యాన్ని అత్యంత ప్రతిభావంతంగా నిర్వహించుతూ వుండటంచూచి, ఒకానొక సందర్భంలో సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వం తనమంత్రివర్గంలోకి ఆవిడను ఆహ్వానించటానికికూడా ప్రయత్నించినట్టు చెబుతారు ఆవిడ ఉదారమైన ఆశయాలుగల యిల్లాలు ; సహధర్మిణిగా యెప్పటికప్పుడు తన భర్త వెన్ను వెనుక యెలలేని బలంగా నిలబడి ఆయన ధార్మిక కార్యకలాపాలన్నిటికి తోడ్పడుతూ వచ్చింది

1950 లో కాంగ్రెస్ కార్యనిర్వాహక వర్గం యేర్పడినప్పుడు యీ దంపతులలో యే ఒక్కర్నీ సభ్యులుగా తీసుకున్నారు కారు — అతఃపూర్వం మూడుసంవత్సరములనుంచీ ఆవిడకార్యనిర్వాహకవర్గంలో సభ్యురాలుగా వుంటూ వచ్చినా కూడా. దీంతో వీరికి స్వతంత్రంగా వ్యవహరించటానికి సావకాశం కలిగింది నిర్లిప్తులుగా వుండి రాజకీయ పరిణామాలన్నిటినీ అవగతం చేసుకుని, నాశిక్‌లోనూ అనంతరమూ కూడా నిర్విరోధమైన మనస్సుతో వ్యవహరించారు

ఏ మతోద్యమం పెంపొందటానికి కానివ్వండి, యే రాజకీయోద్యమం పెంపొందటానికి కానివ్వండి వ్యక్తి నిమిత్తమాత్రుడు జీవపరిణామం ఎలాంటిదో ఈ ఉద్యమాల పరిణతి కూడా అలాంటిదే పరిణామ క్రమంలో అనేక దశలు వస్తవి పురోగమనంలో బాల్య యౌవన కౌమార దశలూ అక్కడినుంచి తిరోగమనంలో వార్థక్య మరణావస్థలూ సంభవించుతై

కాంగ్రెసుకు కూడా అనూచానమైన ఈ పరిణామపతనాల దుర్గతే పడుతుందా అనేది మనం ఊహించలేని విషయం ఏ విధంగా చూచినా దానికీ ఈగతి తప్పనట్టు తోస్తుంది ఈ సంస్థకు ఇప్పటికి 70 యేళ్లు నిండినై మామూలు ఆయుర్దాయ ప్రమాణం సన్నిహితమౌతోంది ఉపనిషత్తులలో పేర్కొనబడిన ఆయుర్దాయ ప్రమాణంవరకూ జీవించి వుంటుందా లేదా అనేది సందేహాస్పదం కాంగ్రెస్ లక్షోపలక్షల ప్రజలతోనూ, వేలాది చదరపు మైళ్ల వైశాల్యంతోనూ కూడిన బృహత్కాయం గల సంస్థ ఈ మహాదేహంలో, యెక్కడ యే చచ్చు ప్రారంభమైందో యెలా చెబుతాం? ఈలాంటి మహాదేహాలు లోపలవున్న జీవచైతన్యంయావత్తూ నశించిపోయినా కూడా ఇంకా అలా పడుండి బ్రతికివున్నట్టే కనుపించుతూ వుంటై మొన్నటివరకూ దేశభక్తి రూపకమైన ఒక సమైక్యభావం పరివ్యాప్తమై జాతిని యావత్తూ చైతన్యపథాన నడిపించి త్యాగదక్షతను కలుగ జేసింది ఆనాటి రాజకీయాలంటే ఒక మతావేశముగా వుండేది ప్రతివారూ ఒక మోక్షపథాన్ని అధిరోహించటానికి సర్వసంగ పరిత్యాగం చేసి పురోగమించుతున్న ఆధ్యాత్మిక యాత్రాపరులుగా వుండేవారు ఆ మోక్షపథగమనమే యేకైకాదర్శంగా వుండేది

కాంగ్రెసుకు ఈ దశ అంతరించింది. అలాంటి యాత్రాపరులూ, సాధుసజ్జనులూ యావన్మందీ ప్రక్కకు నెట్టివేయబడ్డారు. పారిశ్రామికులు, సాహసులూ రంగాన్ని ఆక్రమించారు సత్యసౌందర్యాలకంటే, దైవసంస్కృతులకంటే, భౌతిక బలసంపాదనలకు ప్రాముఖ్యత వచ్చింది కాంగ్రెసుకు ఒక జబ్బుపట్టుకుంది వైద్యశాస్త్రంలో దీన్ని 'ఆర్టీయో స్లరోసిస్' (రక్తనాళాల కఠినతులు) అంటారు ఈ వినాశనాంకురాలను చూచి కృపలానీ చకితులైనారు ఈ దేహానికి కాయకల్ప చికిత్స చేసి వ్యాధి కుదర్చటానికి ప్రయత్నించుతున్నారు ఈ తిరుగుబాటుదారుయొక్క ఆదర్శాలపట్ల జవహర్‌లాలుకు కూడా సానుభూతి వుంది కఠినతులు గట్టి జీవచైతన్యం నశించిపోతున్న ఈ కాంగ్రెస్ దేహానికి తిరిగి యెలాగైనా ఉజ్వలత కలిగించాలని ఆదుర్దా పడుతున్నారు ఈ ఆదర్శాలపట్ల ఇలాంటి సానుభూతి వుండటంవల్లనే నెహ్రూ మధ్యమధ్య, అర్థంలేని ఒక విచిత్ర సమస్యగా కనుపించుతున్నారు. జీవిచైతన్యం నశించిపోతున్న ఆ దేహాన్ని పట్టుకు వ్రేలాడుతున్న కాంగ్రెస్ శ్రోత్రియుల సందర్భి ఒక వేపున చీదరించుకుంటూ, ఆదేహానికి ప్రాణంపోకపూర్వమే యేతులసితీర్థమో యింత పోసి చూడటానికి ప్రయత్నించక పోవటం విచిత్రంగా వుంటుంది ఈ విప్లవకారులు, ఇంకా ఈ దేహంలో కొంత ప్రాణం మెదులుతూ ఇంకా జీవితాశలువుండగానే, దీన్ని శ్మశానానికి మోసెయ్యటానికి ఆతురపడుతూ వుండటం చూచి ఆయన మరింత విభ్రాంతులౌతున్నారు

కృపలానీ ఆమధ్య పార్లమెంటులో అమాంతం పెద్దపెట్టున దండయాత్రప్రారంభించగానే, నెహ్రూ కలవరపడ్డారు వెంటనే ఆయన్ను విచారణకు పెట్టించారు నిందితుడు ఆ విచారణను మరొక పర్యాయం దాడి చెయ్యటానికి సావకాశంగా తీసుకుని, రెచ్చిపోవటం గమనించి గమ్మున ఆ వ్యవహారాన్ని అక్కడితో కట్టిపెట్టేసి మెదలకుండా వూరుకున్నారు గాంధిజీ స్వయంగా పూనుకుని తనచేత రాజీనామా పెట్టించి వున్న కారణంగా, కృపలానీ తనకు అత్యంతమైన బలసంపద వున్నదనే ధీమాతో వున్నారు.

ఈ రాజీనామా, ఉజ్వలమైన పరిణామాలను తేవటానికి సంకల్పించిందే గాని, తిరోగమించి వైదొలగి పోవటానికి దాఖలు చేసింది గాదు గాంధిజీ బ్రతికివుంటే దాని ఫలితాలు యేవిధంగా వుండేవో గాని, యిప్పుడు బహిరంగమైన గోదాలో వైవిధ్య శక్తుల ద్వంద్వ యుద్ధంగా పరిణమించింది

నాశిక్‌లో, కాంగ్రెస్‌లో చెలరేగిన దుష్టశక్తులమీద దండయాత్ర ప్రారంభమైంది ఆ క్షేత్రంలో ఒక నూతన చైతన్యం ప్రభవించటానికి ఆస్కారం కనపించింది అసంతృప్తులైన వారికీ పరాజితులైన వారికీ అదొక మంచి అవకాశంగా లభించింది అలాంటి వారంతా పరస్పరం చేతులుకలిపి పోరాడటానికి ఉద్యమించారు ఏ ఉద్యమమైనా పైకి రావాలంటే దాన్ని తీవ్రంగా ప్రతిఘటించే ప్రతిపక్షం కూడా వుండాలి కాని కాంగ్రెస ఈ విప్లవకారులమీద శిక్షణాదికముల రూపంలో ఏ విధమైన తీవ్రచర్యలూ తీసుకోవటానికి పూనుకోలేదు ఆ ఉపేక్షతో, ఈ ఉద్యమానికి దోహదక్రియ యేదీ లభించక మందకొడిగా వుండిపోయింది ఈ వైవిధ్యభావాలన్నిటినీ సమయ జేసుకోవాలనే ఉద్దేశంతో అనంతరం నడచిన సంప్రదింపులవల్ల కూడా, ఉభయత్రా కూడా రణోత్సాహం కొంతకాలం చల్లబడ్డది

ఈ సంప్రదింపులు భగ్నంకావటానికి ముఖ్య కారణం, పరిష్కారం కుదుర్చు-వటానికి జరుగుతున్న ఉభయపక్షాల వాదాలు ముందుగానే బజారు కెక్కటం, ఉభయపక్షాల పెద్ద మనుష్యులు తమ తమ ఆత్మగౌరవాలకు భంగం రాకుండా చూచుకోవటానికి వెంపర్లాడారు ఉభయత్రా బిర బిగిశారు ఆ విధంగా ఢిల్లీలో కాంగ్రెస్ కమిటీ ప్రయత్నాలన్నీ భగ్నమై పూరుకున్నయ్ మున్ముందు ఈ ద్వంద్వ యుద్ధం యే మొగ్గగా పరిణమించనున్నదో చూడవలసివుంది 

—ఏ పి ఎస్

# డైరి

(5-వ పేజీ తరువాయి)

—సూయజ్ కాలవను ఈజిప్టు దిగ్బంధించడంవల్ల హైఫారిఫైనరీలకు ముడిసూనె వెళ్లకుండా ఉన్నదని ఇజ్రేల్ ప్రతినిధి భద్రతామండలి అధ్యక్షునికి విన్నవించి, ఈవిషయం మండలి ఎజెండాలో చేర్చమని కోరాడు

—పాకిస్తానుతో సన్నిహిత సైనిక సంబంధాలు ఏర్పాటు చేసకొనడానికి బ్రిటను సంసిద్ధంగా ఉందని కామన్స్‌సభలో కామన్వెల్తు సంబంధాల మంత్రి గోర్డన్ వాకర్ తెలిపాడు

—పెసిఫిక్ ఒడంబడిక ముసాయిదాపై అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజీలాండు ప్రతినిధులు సంతకాలు పెట్టారు ఈ మూడు దేశాలలో దేనిపైనగాని దాడి జరిగితే మిగిలిన దేశాలు సహాయం వెళ్లాలని ఈ ఒడంబడిక భావం

యథార్థ ఒడంబడికపై సంతకాలు సెప్టెంబరులో శాన్‌ఫ్రాన్సిస్కోలో జరుగుతవని అధ్యక్షుడు ట్రూమన్ అన్నారు.

## శుక్రవారం, జూలై 13

—పురుషోత్తందాస్ టాండన్ అధ్యక్షతకింద బెంగుళూరు లాల్‌బాగ్‌లోని అద్దాలమేడలో ఎ ఐ సి సి సమావేశం ప్రారంభమయింది కాంగ్రెసు ఐక్యతను గురించి మాట్లాడుతూ, వివిధప్రదేశ కాంగ్రెసునుండీ 2500 మంది రాజీనామాలిచ్చారనీ, అందులో 11 మంది ఎ ఐ సి సి సభ్యులనీ, 35 మంది ప్రదేశ, రాష్ట్రికమిటీ సభ్యులనీ, 35 మంది ప్రదేశ, రాష్ట్రి కమిటీ సభ్యులనీ టాండన్ తెలిపాడు

ఈసమావేశంలో నెహ్రూ ఎన్నికల ప్రణాళిక ముసాయిదాను ప్రతిపాదించాడు ప్రణాళిక ముసాయిదా పూర్తిపాఠం విడుదల అయింది

—కాశ్మీరులో పాకిస్తానువారు యుద్ధవిరమణ నిబంధనను మరి రెండుసార్లు ఉల్లంఘించినట్లు ఐక్యరాజ్య పరిశీలకులకు హెచ్చరిక జరిగింది

—కొరియా యుద్ధవిరమణ సంప్రతింపులు తిరిగి కొనసాగడానికి జనరల్ రిజ్వే కొత్త సూచనలు చేశాడు

యుద్ధ విరమణ సంప్రతింపులు కొనసాగడం ఇష్టం లేకనే అమెరికనులు, అనుకొన్న నిర్ణయాలకు భిన్నంగా ప్రవర్తిస్తున్నారని కమ్యూనిస్టులు ఆరోపణచేశారు

—చికాగోలో సాగిన జాతిసంఘర్షణను అణచడానికి పోలీసులు పెద్ద పోరాటం జరపవలిసి వచ్చింది రెండుగంటల పోరాటం ఫలితంగా 11 మంది ఆస్పత్రి చేర్చబడ్డారు

—ఆఫ్రికారక్షణనుగురించి ప్రిటోరియాలో జరిగే చర్చలో పాల్గొనడానికి రమ్మని బ్రిటను, దక్షిణాఫ్రికా ప్రభుత్వాలు ఈజిప్టుకు తదితర ఆఫ్రికా వలస ప్రభుత్వాలకు ఆహ్వానం పంపినట్లు అధికార ప్రకటన జరిగింది

ఈ సమావేశంలో ఈజిప్టు పాల్గొనకపోవచ్చునని కైరో పత్రికలు వ్రాసినవి

## శనివారం, జూలై 14

—కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక ఆమోదించబడి, బెంగుళూరులో ఎ ఐ సి సి బహిరంగసమావేశం ముగిసింది

హైదరాబాదు విభజించబడి భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడాలని ప్రణాళికకు అయ్యదేవర కాళేశ్వరరావు తెచ్చిన సవరణను నెహ్రూ ఖండించాడు

ఏ ఐ సి సి చర్చలో నెహ్రూ మాట్లాడుతూ కంట్రోళ్లు ఎత్తివేయడం ఎంతమాత్రం సాధ్యంకాదని ఉద్ఘాటించాడు

—భారతప్రధాని నెహ్రూ బెంగుళూరులో బహిరంగసభలో మాట్లాడుతూ దేశానికి బలమైన ప్రభుత్వం ఏర్పడేలాగు చూడాలని దేశంలోని వోటర్లను హెచ్చరించాడు

—కాంగ్రెసు వర్కింగ్ కమిటీలో మార్పులు చేయడానికి ఆలోచనలు జరుగుతున్నట్టు వార్తలు వెలువడ్డవి

—కేంద్ర ప్రభుత్వ ఆర్థికశాఖస్టేట్మంత్రి మహావీరత్యాగీ, కాంగ్రెసు రా ప్రయత్నాలు విఫలమయేయెడల కాంగ్రెసు పార్టీ తరఫున ఎన్నికలకు అభ్యర్థులను నిలబెట్టరాదని సూచించాడు

—అమెరికా తయారుచేసిన జపాను శాంతిఒడంబడిక రష్యా చైనాలపైకి జపానను ఉసికొల్పుతున్నదని రష్యా ఆక్షేపించింది

సెప్టెంబరులో శాన్‌ఫ్రానసిస్కోలో ఏర్పాటు కానున్న జపానుశాంతిసమావేశం, జపానుగురించి జరిగిన అంతర్జాతీయ ఒడంబడికలకు భిన్నంగానూ, జపానుతో పోరిన దేశాలన్నిటికీ అవమానంగానూ, ఉన్నదని పికింగ్ రేడియో అన్నది

—కాశ్మీరు ప్రధాని షేక్ అబ్దుల్లా ఎ ఐ సి సి సమావేశంలో మాట్లాడుతూ కాశ్మీరుపట్ల నెహ్రూవైఖరిని కాశ్మీరు సంస్థానం పూర్తిగా బలపరుస్తుందన్నాడు

—నిలిచిపోయిన కొరియాయుద్ధ విరమణ సంప్రతింపులు కొనసాగడానికి జనరల్ రిజ్వే చేసిన సూచనలను కమ్యూనిస్టు లంగీకరించారు 

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(8-వ పేజీ తరువాయి)

హొటల్ ని మార్సేల్స్ నించి వచ్చిన ఒక దర్జీకి అమ్మేశాడు ఈ కొత్త యజమానితో కూడా మా మామూలు ఏర్పాట్లు ఉన్నాయి ఇప్పుడితని ఇంట్లో తలదాచుకోడానికి వెళ్లాను"

"అతని పేరేమిట ?" అన్నాడు మాంట్ క్రిస్టో

"గాస్పర్డ్ కాడరూస్ అతనిభార్య పేరు రాడెల్"

"ఇదెప్పుడు జరిగింది ?"

"1829 లో"

"ఏమాసం ?"

"జూన్"

"ఏవారం ?"

"మూడో తేదీ సాయంకాలం"

"ఓహో ! 1829 జూన్ 3 వ తేదీ నన్నమాట ? సరే చెప్పు

"కాడరూస్ హొటల్లో దాగడం మాకు పరిపాటే ఎప్పుడూ వెనక గుమ్మంలోనించే లోపలికి వెళ్లేవాళ్లం ఆ రోజు కూడా వెనకదారిని వెళ్లాలనుకున్నాను కాని తలుపు లోగడియ వేసి ఉంది గోడ దూకి లోపలికి వెళ్లాను మెల్లిగా చెట్లచాటునించి నడిచి వెళ్లాను కాడరూస్ కాక ఇంకెవరైనా ఉంటారనే భయంతో వెంటనే ఇంటిలో ప్రవేశించలేదు ఇంటినంటి వెనక ఒక సాక ఉంది పాకకీ ఇంటికీ మధ్య చెక్కలగోడమాత్రం అడ్డు ఇంటి సావడిలో ఉన్నవారిని చెక్కల సందుల్లోనుంచి చూడవచ్చును నేను వెళ్లేటప్పటికి నిజంగానే సావడిలో ఎవరో కొత్త వ్యక్తి ఉన్నాడు

"కొత్త వ్యక్తి దక్షిణ ఫ్రాన్స్ కి చెందినవాడై ఉంటాడు బుకేర్ సంతలో నగలు అమ్మడానికి వచ్చాడు కాడరూస్ గబగబా మెట్లెక్కుతూ భార్యని పిలిచాడు 'రాడెల్ ! మాట మాట ! పాపం ఫాదరీ మనల్ని మోసం చెయ్యలేదు సుమా వజ్రం అసలైనదే గాజుముక్క కాదు' అన్నాడు రాడెల్ ఆనందంతో వెర్రికేక పెట్టింది కర్రమెట్లు చప్పుడైనాయి 'ఏమన్నావు?' అంది

'ఈ వజ్రం అసలైనదే ఈయన పారిస్ నగలవర్తకుడు దీన్ని 50 వేల ఫ్రాంకులికి కొంటానంటున్నాడు ఇది నిజంగా మనదౌనో కాదో అని అనుమానించి ఇక్కడికి వచ్చాడు. నువ్వు చెప్పు ఆయనకి జరిగిందంత' అన్నాడు కాడరూస్

"నగలవర్తకుణ్ణి కూచోబెట్టి కాడరూస్ పానీయాలు తీసుకువచ్చి ఇచ్చాడు నగలవర్తకుడు ఇల్లంతా జాగ్రత్తగా పరిశీలించాడు తనకి వజ్రాన్ని అమ్మచూపుతున్న ఇద్దరూ ఎంత పేదవాళ్ళో ఆ మనుషుల్ని చూసినా హొటల్ని చూసినా తెలుస్తూనే ఉంది 'చెప్పండి ఏంజరిగిందో పూర్తిగా చెప్పండి' అన్నాడు

"రాడెల్ ఇలా చెప్పింది 'నిజంగా భగవంతుని దయ అపారం పూర్వం ఎప్పుడో 1814 లోనో 1815 లోనో నాభర్తకి డాంటే అనే మిత్రుడుండేవాడట ఆ మిత్రుణ్ణి ఎప్పుడో మరిచిపోయాడు కూడా కాని అతను మరిచిపోలేదు అతను చచ్చిపోతూ ఈ వజ్రాన్ని నాభర్తకివ్వమన్నాడుట'

'అయితే దీన్ని ఇప్పుడీయన కెవరిచ్చారు ?"

'డాంటే ఖైదులో ఉండగా భాగ్యవంతుడైన ఒక బ్రిటిష్ దేశస్థునితో స్నేహంచేసుకొన్నాడు బ్రిటిష్ దేశస్థుడు ఖైదులో జబ్బుపడినప్పుడు డాంటే రాత్రిం బగళ్లు పరిచర్య చేశాడు దానికి కృతజ్ఞతా పూర్వకంగా ఇంగ్లీషు దేశస్థుడు విడుదలై వెళ్ళిపోతూ ఈ వజ్రాన్ని డాంటేకి బహుమానంగా ఇచ్చాడు డాంటే ఖైదులోనే చచ్చిపోయాడు చచ్చిపోయేముందు నాభర్తకిమ్మని వజ్రాన్ని ఒక ఫాదరీకి ఒప్పగించాడట ?

'సరిగ్గా అదే కథ! నమ్మడానికి వీల్లేనిదే కాని నిజమే కావచ్చు అయితే ఇంక ధరగురించి మాకు రాజీ కుదరడం లేదు'

'కుదరకపోవడం అంటే?' అన్నాడు కాడరూస్. 'ధర కుదిరిందనుకున్నానే'

'నేను నలభైవే లిస్తానన్నాను'

'నలభై వేలా?' అంది రాడెల్ 'ఆ ధరకైతే వజ్రం అమ్మేది లేదు దీని ఖరీదు ఏభైవేలుంటుందని ఫాదరీ చెప్పాడు'

'ఫాదరీ పేరేమిటి?' అన్నాడు నగలవర్తకుడు

'బుసోనీ' అంది రాడెల్

'విదేశస్థుడా?'

'అవును ఇటలీదేశస్థుడనుకుంటాను'

'ఏది, వజ్రాన్ని మరొకసారి చూడనివ్వండి ఒకసారి చూస్తే చాలదు ఉన్నపట్టున ధర నిర్ణయించడం కష్టం'

"కాడరూస్ జేబులోనించి చక్కని భరిణ ఒకటి తీసి మూత తెరిచి నగలవర్తకుని చేతి కందిచ్చాడు దాన్ని చూస్తుంటే రాడెల్ కళ్లు తళతళ మెరిశాయి"

"ఈ కథనిని నువ్వు నమ్మావా బర్టుక్సియో ?" అన్నాడు మాంట్ క్రిస్టో

"నమ్మానండి"

"ఈ ఎడ్మండ్ డాంటే అనే వ్యక్తిని నువ్వెరుగుదువా?"

"ఎరగనండి అంతకు ముందెప్పుడూ ఆ పేరైనా వినలేదండి తరవాత నేను ఖైదులో ఉండగా బుసోనీ చెప్పగా ఒక్కసారి మాత్రం విన్నానండి"

"సరే చెప్పు"

"నగలవర్తకుడు ఆ వజ్రం తాపిన ఉంగరాన్ని తీసి జేబులోనించి బుల్లి రాగి తక్కెడలో దాన్ని తూచాడు 'సరిగ్గా నలభై అయిదు వేలిస్తాను పైన చిల్లిగవ్వకూడా ఇవ్వను దీని ఖరీదింతే కదా అని సరిగ్గా అంతే తెచ్చాను డబ్బు' అన్నాడు

'పోనీలెండి' అన్నాడు కాడరూస్ 'మరొకరైనా కొనకపోరు' అని ఉంగరం భరిణలో మూతపెట్ట జేబులో పెట్టుకున్నాడు

'కావచ్చు' అన్నాడు వర్తకుడు 'కాని నా మాదిరిగా ఎవరూ బేరం సులువుగా కుదర్చరు నీమీద పోలీసులికి ఫిర్యాదు ఇస్తారు మీరు బుసోనీకోసం వెతకవలసివస్తుంది ఇటువంటి వజ్రాన్ని మీకిచ్చి ఊరుకునే ఫాదరీలు సులువుగా దొరకరు. పోలీసులు మిమ్మల్ని పట్టుకుని ఖైదుచేస్తారు వజ్రాన్ని వారు తీసుకుంటారు రెండుమూడు మాసాలలో బుసోనీ దొరికి మీరు విడుదలైనా, ఆ ఉంగరం మళ్లీ మి చేతుల్లోకి వచ్చేసరికి ఏ గాజుముక్కో అయిఉంటుంది ఏభైవేలకి బదులు మూడుఫ్రాంకులు వస్తుంది మీకు అయినా అదీ కొనేవాళ్లు కనపడరు'

"కాడరూస్, రాడెల్ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు 'కాదండి' అన్నాడు కాడరూస్ 'అయిదు వేలు నష్టానికివ్వడానికి మేం భాగ్యవంతులం కాము'

'అయితే మీ యిష్టం నేను సరిగ్గా నలభై అయిదు వేలే తెచ్చాను రొఖ్ఖం అన్నీ బంగారు నాణేలు తెచ్చాను ఇదిగో చూడండి' అంటూ నగలవర్తకుడు జేబులోనుంచి గుప్పెడు నాణేలు తీసి గలగల లాడించాడు

"కాడరూస్ మనస్సులో చాలా మథనపడ్డాడు భార్యవంక తిరిగి 'ఏమంటావ్?' అన్నాడు

'సరే కానీ, ఇచ్చెయ్యి ఆ లాభమేదో ఆయన్నే తీసుకోనియ్యి' అంది రాడెల్

'సరే తీసుకోండి, నలభై అయిదు వేలే ఇవ్వండి నాభార్యకి

ఒక బంగారు హారం కావాలిట నాకు, వెండి బొత్తాములు కావాలి '

"నగలవర్తకుడు తన జేబులోనించి ఒక పెద్ద పెట్టొకటి తీశాడు అందులో రకరకాల నగల నమూనాలున్నాయి 'ఇవిగో చూడండి మీకు నచ్చినది ఎంచండి '

"రాడెల్ ఒక హారం తీసుకుంది కాడరూస్ వెండిబొత్తాములు తీసుకున్నాడు 'ఇంక ఈ బేరానికి మీరొప్పుకున్నట్టేనా?' అన్నాడు నగలవర్తకుడు

కాడరూస్ బొంగురుపోయిన గొంతుకతో 'ఆ! ఇంక నలభై అయిదు వేలు లెక్కపెట్టి ఇవ్వండి' అన్నాడు నగలవర్తకుడు ఒక సంచి తీసి మేజామీద బోర్లించాడు పదిహేను వేల ఫ్రాంకులు బంగారు నాణేలలోనూ, ముప్ఫై వేలు నోట్లలోనూ లెక్కపెట్టి ఇచ్చాడు

'ఉండండి దీపం వెలిగించి తీసుకువస్తాను' అంది రాడెల్. దీపం వచ్చిన తరవాత కాడరూస్ లెక్కపెట్టడం మొదలుపెట్టాడు నాలుగైదు పర్యాయాలైనా లెక్కపెట్టి ఉంటాడు తరవాత అతని భార్య మరి మూడుసార్లు లెక్కపెట్టింది. 'ఏం? సరిపోయిందా?' అన్నాడు వర్తకుడు

'సరిపోయింది రాడెల్! నా పుస్తకం, తోలుసంచి తెచ్చిపెట్టు' అన్నాడు కాడరూస్

"రాడెల్ మిద్దమీదికి వెళ్ళి ఒక చిన్న తోలుసంచి తీసుకువచ్చింది అందులో నలిగిపోయి మరకలుపడిన ఉత్తరాలు కొన్ని ఉన్నాయి కాడరూస్ సంచి నింపి భార్యచేతి కిచ్చాడు 'మాకు పదివేల ఫ్రాంకులు నష్టం వస్తే వచ్చిందిలెండి, ఈ రాత్రికి మా యింట్లో భోజనం చేస్తారా ?' అన్నాడు కాడరూస్.

'లేదండి ఇప్పటికే ఆలస్యమైపోయింది నేను బుకేర్‌కి తిరిగి వెళ్ళిపోక అప్పుడు నా భార్య ఆందోళనపడుతూ ఉంటుంది' జేబులో గడియారం తీసి చూసుకున్నాడు 'అమ్మో! అప్పుడే తొమ్మిదిగంటలయిందే! బుకేర్ వెళ్ళేసరికి అర్థరాత్రవుతుందన్నమాట! ఇంక ఆలస్యం చెయ్యకూడదు వెడతాను బుసోనీ మీకు కనపడితే నాకు కబురుచెయ్యడం మరిచిపోకండి '

'మీరు బుకేర్ నించి వెళ్ళిపోడానికి ఇంకా వారంరోజులు పట్టుతుంది కాదూ ?' అన్నాడు కాడరూస్

'వారం పట్టితేనేం ? పారిస్‌లో నా చిరునామా మీ కిచ్చానుగా! ఆయన ఎక్కడున్నాడో తెలిపితే నేనే వెళ్ళి చూస్తాను' అన్నాడు నగలవర్తకుడు

"సరిగ్గా ఈ సమయంలోనే ఉరుము వినపడింది మెరుపులు కూడా మెరుస్తున్నాయి

'అయ్యో' ఇంకేలాగ ? ఇప్పుడు పెద్దవర్షం వచ్చేలాగుంది ఈ వర్షంలో మీ రెలా వెడతారు ?' అన్నాడు కాడరూస్

'అబ్బే! నేను ఉరుములికీ మెరుపులికీ భయపడను ' అన్నాడు వర్తకుడు

'అయితే క్షేమంగా వెళ్ళిరండి' అన్నాడు కాడరూస్

వర్తకుడు తలుపు తెరిచేసరికి ఒక తెర గాలి విసురుగా వచ్చింది దీపం ఆరిపోయినంత పనయింది 'అయ్యో! ఇప్పుడెల్లాగ ? ఆరుమైళ్లు ఈ వానలో నడిచి ఎలా వెళ్లడం ?' అనుకున్నాడు వర్తకుడు

'నా మాట వినండి ఇక్కడే ఈ రాత్రి నిద్రపొండి '

'అబ్బే! అలా వీల్లేదు వెడతాను ఏమైనాసరే ఈ రాత్రికి బుకేర్ చేరుకోవాలి '

కాడరూస్ మెల్లిగా వీధిగుమ్మందగ్గిరకు వెళ్లాడు

'తలుపు మూసెయ్యి ఈ గాలి నాకు పడదు' అని రాడెల్ బిగ్గరగా కేక పెట్టింది

'ఇంట్లో డబ్బుకూడా వుంది అవును' అంటూ కాడరూస్ తలుపు మూసి గడియవేశాడు మళ్ళీ ఇద్దరూ సంచి తీసి డబ్బు లెక్కపెట్టడం ప్రారంభించారు 'రాత్రి కిక్కడ పడుకోమని అతని కెందుకు చెప్పావ్ ?' అంది రాడెల్ ఆమె గొంతుక తడారిపోయినట్లుంది

'ఎందుకంటే?' అన్నాడు కాడరూస్ ఈమారు అతని కంఠస్వరం కంపించింది 'ఏముంది? రాత్రివేళ అంత దూరం ఈ వానలో నడిచి వెళ్ళలేడని' అన్నాడు

'ఓహో' అంది రాడెల్ నిజంగా అప్పుడామె స్వరంలోని విలక్షణాన్ని వర్ణించడం నా తరం కాదు 'ఎందుకో ననుకున్నాను' అంది

'నీ వక్రబుద్ధులు పోనిచ్చుకోలేవు ' అన్నాడు కాడరూస్. 'అసలు నీ కిటువంటి దురాలోచన లెందుకు పుడతాయి ? పుట్టినా బయటి కెందుకు కక్కుతావ్

'అవును నువ్వు మగవాడవ '

'అంటే'

'నువ్వే మగవాడవైతే అతన్ని ఈ రాత్రి వెళ్ళనిచ్చి ఉండే వాడవ్ కాదు '

'నోరు ముయ్యి'

'కనీసం బుకేర్ చేరలేకపోయేవాడే'

'ఫీ'

'రోడ్డు మలుపుతిరిగే చోటకి ఇక్కడ నించి దగ్గిరదారి ఉంది '

'ఛీ! నీది పాపిష్టిబుద్ధి భగవంతుడు దీని సహించడుసుమా. అదుగో! విను '

"సరిగ్గా ఈ సమయంలో పిడుగుపడినట్లు శబ్దమయింది కాడరూస్ భగవంతుని స్మరించాడు శబ్దం అణిగేసరికి తలుపు దబదబ కొట్టిన చప్పుడు వినవచ్చింది భార్యభర్త లిద్దరూ నిశ్చేష్టులైనారు ముఖాలు చూసుకున్నారు

'ఎవరక్కడ?' అని కేకేశాడు కాడరూస్ మేజామీద పరిచిన ధనాన్ని పోగుగా లాగి సంచిలో పోశాడు. రెండుచేతులా సంచిని ఛాతీకి అదిమిపట్టుకున్నాడు

'నేను' అని సమాధానం వచ్చింది

'నేనంటే ?'

'నేను నగలవర్తకుణ్ని '

'హు! భగవంతుడు వార్షించడన్నావ్! భగవంతుడే అతన్ని మన దగ్గర కిప్పుడు పంపాడు' అంది రాడెల్

కాడరూస్ కుర్చీలో వెనక్కి వాలిపోయాడు ముఖం పాలిపోయింది రాడెల్ మెల్లిగా లేచి జాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ ద్వారం సమీపించి గడియతీసింది 'రండి లోపలికి రండి' అంది

"వర్షంలో తడిసి ముద్దైపోయాడు వర్తకుడు " 'ఈ రాత్రికి నేను బుకేర్ వెళ్ళడం దేవుడి కిష్టంలేదు మీరు ఆహ్వానించారు కాడరూస్ ఇక్కడ విశ్రాంతికోసం, ఇదగో! మళ్ళీ వచ్చాను '

తడబడుతూ కాడరూస్ ఏదో అన్నాడు కాని అదేమిటో తెలియలేదు నుదుటపట్టిన చెమటను చేత్తో తుడుచుకున్నాడు. వర్తకుడు లోపలికి రాగానే రాడెల్ తలుపుమూసి, గడియ వేసింది

★

Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras

RAJA
"RAJA" SNOW
MANYAM & CO.
RAJA HAIR OIL
RAJA Kasturi Soap
MANYAM & CO.
RAJA MANYAM & CO.

# రాజా
స్నో, హేర్ఆయిల్
కస్తూరిసోపు, హేర్ ఫిక్సర్

FAS

Use RAJA Face Powder & RAJA TOOTH Paste

RAJA (TRADE MARK)

**AGARBATHI**
2 TOLAS

MANUFACTURERS:
MANYAM & CO.,
BANGALORE.3.